స్వచ్ఛమైన చిరునవ్వుకి... అచ్చమైన చిరునామా...

# హాస్యానందం

సంపూర్ణ హాస్య మాస పత్రిక

డిశంబర్-2013

₹15/-

వెల కట్టలేని
మీ ఆనందానికి
15 రూపాయలు
ఓ లెక్కేనంటారా?





క్రైట్ ఫన్! ఫలితాలు మధ్యపేజిల్లో...



స్వచ్ఛమైన చిరునవ్వుకి... అచ్చమైన చిరునామా...




సంపూర్ణహాస్య మాస పత్రిక

డిశంబర్-2013 ✦ సంపుటి-10 ✦ సంచిక-8

| | | |
|---|---|---|
| *Publisher&Editor* | : | Ramu.P |
| *Chief Artist* | : | A.Dayakar |
| *Cartoon Editor* | : | A.V.M |
| *Full'Pillar* | : | Bnim |
| *Abroad Promoter* | : | V. Pavan Kumar, USA |
| *Well Wishers* | : | Tanikella Bharani<br>Jaydev<br>Mallik<br>Sanku |
| *Designing* | : | Creative Graphix |
| *Creative Team* | : | Tumbali Sivaji<br>T.Chandra Sekhar<br>Rampa<br>P.V.Narayana<br>Ramsheshu<br>P.Priyatham<br>Mallikarjun.U |
| *Address* | : | HASYANANDAM,<br>#8-215/4,<br>Near Ramalayam,<br>Po:YERRABALEM<br>Pin 522 503,<br>Mangalagiri Mandal,<br>Guntur dist. |
| *Ph* | : | **9849630637** |

email: **hasyanandam @yahoo.com**

Hyderabad & Secunderabad Distributors:



**Charminar News Agencies,**
1-6-176/1, M.G.Road,
Khandoji Bazar, **Secunderabad-3.**
Ph:9346515813
J.N.Road, Abids, **Hyderabad.**
Ph:040-30720007



# హాయ్... సానందంగా...

**హా**స్యానందం అభిమానులకు... ఆప్తులకు... సన్నిహితులకు హాస్యాభివందనాలు!

అమ్మ ఒడిలో ఆడుకునే బాల్యం...

అనుకున్నది సాధించుకునే మనస్తత్వం...

కావాలనుకున్నవి పొందే వరకు చేసే మారాం...

వద్దనుకున్నవి నిర్మొహమాటంగా తోసిపుచ్చే మొండితనం...

తనకిష్టమైనట్లు బ్రతికే స్వేచ్ఛ....

ఇలా అందరూ ఉండాలనుకుంటారు.

కానీ ఎంతమంది వాళ్ళు 'అనుకున్నట్లుగా' బ్రతుకుతున్నారు?

ఈ రోజుల్లో ప్రతి వారు 'సమీకరణలతో' ఎదుటి వాళ్ళను బేరీజు వేసుకుంటూనే బంధాలు... అనుబంధాలు...సంబంధాలను కొన సాగిస్తున్నారు.... ఇలాంటి వ్యవస్థలో పైపై ఏవైనా మనం సాధించగలమా?!

ఎదుటివారిమీద అపనమ్మకంతో ఇలా 'జీవన విధానం'గా చేసు కుంటున్నారు. ఎవరికి వారు 'అయ్యోపాపం!' అనుకునే లైఫ్‌స్టైల్ ఇది!

ధైర్యంగా ఇతన్ని నేను నమ్ముతున్నాను అనే గొప్ప నమ్మకాలు ఎవరికీ ఉండటం లేదు. ఎందుకూ?!...

ఇన్‌సెక్యూరిటీ ఫీలింగ్! నమ్మితే ఎక్కడ ముంచేస్తాడోననే అనుమానం!

'ఇది ఇంతే!...నేనింతే!!' అనుకోకుండా ఎవరికి వారు నమ్మకం తో కనీసం మనకు ఆప్తులయిన 'నలుగురి'తో ఏ అరమరికలు లేకుండా మన భావాలను పంచుకునే ఓ 'చిన్నప్రపంచం' సృష్టించ డానికి ప్రయత్నిద్దాం!...

'అమ్మో! నలుగురే...' అనుకుంటే మాత్రం వాళ్ళను ఆ దేవుడే కాపాడాలి!

క్యాప్షన్‌లెస్ కార్టూన్ల పోటీకి వచ్చిన స్పందన... మన కార్టూ నిస్ట్‌ల ఉత్సాహాన్ని తెలియజేసింది. ఇందులో పాల్గొన్న కార్టూనిస్ట్ లందరికీ అభినందనలు!

అందరూ హాయిగా...ఆనందగా ఉండాలని కోరుకుంటూ...

–రాము.పి
(ఎడిటర్)


26


30

అట్టహాసిని: శృతిహాసన్

## కార్టూన్లు



## ఎక్కడ ఏ నవ్వులున్నాయో....



**సినీతులు** ప్రముఖ రచయిత త్రివిక్రమ్ శ్రీనివాస్ కొన్ని సినిమాల్లో రాసిన కొన్ని పంచ్ డైలాగులు. సేకరణ: పి.ప్రియతమ్

## మన జనాలు ..హరగోపాల్...



తెలుగు కార్టూన్లకి గ్లామర్ అద్దిన కార్టూనిస్ట్...
కాలేజీ కుర్రకారుల మదిలో సినీహీరోలా స్థాయిలో
స్థానం సంపాదించుకున్న కార్టూనిస్ట్...
కార్టూన్లతో వ్యాపార ప్రకటనలకు నాంది పలికిన
కార్టూనిస్ట్-శ్రీసత్యమూర్తి!
అచ్చతెలుగు కార్టూనిస్ట్ అయిన

**సత్యమూర్తిగారి 'కార్టూన్ వైభవం'**

హాస్యానందం జనవరి ప్రత్యేక సంచికగా
రూపొందుతుంది.





సత్యమూర్తి గారిని మీరు అభినందించాలంటే...
మెయిలోనో... పోస్టులోనో డిశంబర్ 15లోగా
పంపించడం మరచిపోకండి!



# క్వైట్ ఫన్!

హాస్యానందంలో
**క్యాప్షన్‌లెస్ కార్టూన్‌లకు ప్రతినెలా బహుమతులు**

మొదటి బహుమతి- **రూ.500/-లు**
రెండవ బహుమతి- **రూ.300/-లు**
మూడవ బహుమతి- **రూ.200/-లు**

నిబంధనలు:
కాపీలు, ఎక్కడైన ప్రచురించబడినవి దయచేసి పంపవద్దు!

ప్రతి నెలా 15వ తేదీలోగా
మీ కార్టూన్లు మాకు చేరేలా పంపించండి!

మీ కార్టూన్లు ఈ మెయిల్ కి మెయిల్ కూడా చేయవచ్చు- quitefun.hasyanandam@gmail.com

## శ్రీసత్యనారాయణగారికి అభినందనలు

నచ్చిన క్యాప్షన్‌లెస్ కార్టూన్ బుల్లెట్‌కు శ్రీ సత్యనారాయణగారు బహుమతులు ఇస్తారని చదివి... ఆశ్చర్యం... ఆనందం కలిగాయి!

ముందుగా కార్టూన్ ఇష్టులు అయిన శ్రీ సత్యనారాయణగారికి హృదయపూర్వక అభినందనలు చెప్పుకోవాలి... చెప్తున్నాను.

సాధారణంగా కార్టూన్ నచ్చితే బావుంది... చాలా బావుంది...కేక... సూపర్!... అని అభినందిస్తూ ఉంటారు. సంతోషం! వారికి కృతజ్ఞతలు. ఇంకొందరు ముందుకెళ్ళి ఆ కార్టూనిస్ట్(లను) ఫోన్ ద్వారానో పత్రిక ముఖంగానో వ్యక్తిగతంగానో ఉత్తరాలు రాసి వారిని అభినందిస్తుంటారు. చాలా సంతోషం వారికీ కృతజ్ఞతలు.

కాని కార్టూన్ నచ్చితే ఆనందించి... ఆస్వాదించి తన ఆనందాన్ని ఇష్టాన్ని అభినందనతోపాటు బహుమతి ఇచ్చి ప్రోత్సాహించాలనుకోవటం నిజంగా చాలా గొప్ప విషయం... ప్రశంసనీయం!

ఏ కళాకారులైన కాసులకోసం కాకుండా క్లాప్స్ కోసం ఎదురు చూస్తారు... ఆరాట పడ్తారు... అవి బలం ఆత్మవిశ్వాసాన్ని ఇస్తాయి... ఉత్సాహపరుస్తాయి. ఇక బహుమతులతో కూడిన అభినందనలు లభిస్తే ఇంకా బావుంటుంది. ఇంకా బలం... ఆత్మవిశ్వాసం ఎక్కువౌతుంది.

**శ్రీ సత్యనారాయణగారు హర్షించదగిన స్వాగతించదగిన ఒక మంచి సంప్రదాయానికి నాంది పలికారు.**

'శ్రీసత్యనారాయణగారూ! ప్రతినెలా మీకు నచ్చిన కార్టూన్లకు బహుమతులు ఇవ్వడం చిన్న విషయం కాదు! చాలా గొప్ప విషయం!! ఈ విధంగా మీరు కార్టూనిస్ట్ మిత్రులకు ఇస్తున్న ప్రోత్సాహం అంతా ఇంతా కాదు! ఇలాంటి తరహా అభినందనలు... ప్రోత్సాహం వల్ల కూడా మంచి, గొప్ప, అద్భుతమైన కార్టూన్లు వస్తాయి. వచ్చితీరతాయి!

కార్టూనిస్ట్ మిత్రులారా! మొదడుకు పదును పెట్టి... క్రోక్విల్ కరవాలాన్ని ఉత్తమస్థాయిలో ఝుళిపించండి!

కార్టూనిస్ట్ మిత్రులందరి తరపున శ్రీ సత్యనారాయణగారికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ... **–గోపాలకృష్ణ, కార్టూనిస్ట్, హైదరాబాద్**




**హ**రి కలవరం ఆలోచింపదగ్గది. 'కార్టూన్లు జోక్స్‌స్థానంలో ఇప్పటికే సినిమా కబుర్లు వచ్చాయి. దానికి తోడు తెలుగురాని పిల్లలు తయారైతే... తెలుగు వచ్చిన వారికి కార్టూన్లంటే ఇష్టం లేక పోతే...' అయినా ఆశ! తెలుగు కార్టూన్లు ఎప్పుడూ చిరునవ్వులు తెప్పిస్తునే ఉంటుంది.

తెలుగు తనానికి వంటింటికి సంబంధముంది! కాఫీ గానీ టీగానీ తాగకుండా ఐడియాలు ఆలోచించగలమా! హరి అంతర్మథనం నుండి అమృతంలాంటి ఐడియాలు ఉద్భవించాలని ఆశిస్తున్నాను. హాస్యానందంలో కార్టూనిస్ట్‌లకు ఇస్తున్న ప్రోత్సాహం అభినందనీయం! ఇందులో వచ్చే కార్టూన్లు ఎన్నో సబ్జెక్ట్ మీద వెరైటీగా ఉంటున్నాయి. కీపిటప్! **–జి.ఎస్.ఆర్., హైదరాబాద్**

**డ**యాబెటిస్ దే ఆ రోగమును రాకుండా ప్రతి మనిషి ప్రతిన బూని ఆమార నియమాలను పాటించాలి! కార్పోరేట్ విద్య తెలుగు కార్టూన్లు నాశనం చేస్తుంది. క్యాప్షన్‌లెస్ కార్టూన్లకు స్వాగతం! డిశంబర్ మాసం పుణ్యం చేసుకుంది. అనేక కొత్త శీర్షికలు రావడం మా అదృష్టం! **–వాస్తు రామచంద్ర, నెల్లూరు**

**న**వంబర్ హాస్యానందం ముఖచిత్రం చాలా బాగుంది. వెరైటీకి మారు పేరుగా హాస్యానందం రూపొందిస్తున్న మీకు ముందుగా మా అభినందనలు. ఇందులో ప్రచురించిన కార్టూన్లు వేటికవే పోటీపడుతున్నట్లుగా ఉండి, అన్ని కార్టూన్లు అలరించాయి. అలాగే కథలు కూడాను! రచయితలకు, కార్టూనిస్ట్‌లకు నా అభినందనలు!

**–గుడిపూడి మీనాక్షి, విశాఖపట్టణం**



ఏవిఎమ్

# మనవాళ్ళు

అధికార పక్షం

1

వీడ్ని రక్షిస్తే! వీడి కులపు ఓట్లన్నీ నాకే.. రేపు ఎన్నికలలో గెలుస్తా!!

2

3

వీడిని రక్షిస్తే.. వీడి తాలూకు ఓట్లన్నీ నాకే!

ప్రతిపక్షం

4

5

6



# మల్లిక్ కామెడీ కథలు

## దొంగతనాలు బంద్

హైదరాబాద్‌లో హఠాత్తుగా దొంగతనాలు ఎక్కువయ్యాయ్.

రోజూ ఏదో ఒక ఏరియాలో దొంగతనం జరుగుతూ ఉంది. పోలీసు స్టేషన్లలో వందల కొద్దీ కేసులు నమోదు అవుతున్నాయ్.

ఆ దొంగతనాల గురించి రకరకాల రూమర్లు స్ప్రెడ్ అయ్యాయి. కొందరేమో మహారాష్ట్ర నుండి ఒక దొంగల ముఠా నగరంలో దిగిందని అంటే, మరి కొందరేమో బెంగాల్ నుండి దొంగలు వలస వచ్చారని అన్నారు.

రూమర్లమాట ఎలా ఉన్నా... పోలీసులు మాత్రం దొంగల గురించి ఏ మాత్రం పట్టించుకోలేదు.

కానీ పోలీసులు దొంగల్ని పట్టించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది.

ఎందుకంటే...

బాపనయ్య ఇంట్లో దొంగలుపడ్డారు గాబట్టి.

బాపనయ్య అంటే అల్లాటప్పా కాదు. మినిష్టర్ మిన్నారావు బామ్మర్ది.

ఏ అర్ధరాత్రి వేళో దొంగలు వచ్చి గప్‌చుప్‌గా దొంగతనం చేస్కుని పోయారు.

తెల్లారి లేచిం తర్వాత గానీ బాపనయ్యకి తెలీదు ఇంట్లో దొంగలు పడినట్టు.

ఏమేం దొంగతనం జరిగాయో లెక్క చూస్కున్నారు. యాభైవేలు ఖరీదు చేసే నగలు... ఎనిమిదివేల రూపాయల నగదు...ఒక వాచి.. నాలుగైదు పట్టుచీరలూ పోయాయి.

బాపనయ్య భార్య నాంచారమ్మ ధన్‌ధన్ మంటూ గుండెలు బాదుకుని "వామ్మో... వామ్మో..." అంది.

బాపనయ్య నేనేం తక్కువ తిన్లేదు అని... ధణేల్... ధణేల్ మని గుండెలు బాదుకుంటూ తన బావగారైన మినిష్టర్ మిన్నారావు దగ్గరికి పరుగు తీశాడు.

"మా ఇల్లు దోచేశారు బా..." అన్నాడు ఘొల్లుమంటూ.

"నా పేరు చెప్పుకుని నువ్వు ఊళ్ళోవాళ్ళని దోచేస్తున్నావని విన్నాన్... అట్టాంటి నిన్నే దోచేశారా?... హ్హాహ్హాహ్హా..." అన్నాడు మినిష్టర్ మిన్నారావు.

"ఏంటా ఇకిలింపు! ఇంకాపుతారా నాలుగు కాజాలు తినిపించనా?..." అంది మిన్నారావు భార్య అచ్చమాంబ.

మినిష్టర్ మిన్నారావు నవ్వటం మాని బిక్క మొహం వేసి అచ్చమాంబవైపు చూశాడు.

"అవునుగాని వాడిల్లు దొంగలు దోచుకుని బాధపడ్తుంటే మీరేంటి వాడికి సహాయం చేయడం పోయి హాస్యాలాడ్తున్నారు?... ఆ!!" భర్తవంక కోపంగా చూస్తూ అంది అచ్చమాంబ.

"హయ్యో! సహాయం ఎందుకు చెయ్యనూ? తప్పకుండా చేస్తాను... హిహి... అది నాకానందం కాదా?" అన్నాడు మినిష్టర్ మిన్నారావు.

అప్పటికప్పుడే మినిష్టర్ మిన్నారావు పోలీసు ఆఫీసర్లకి ఫోన్‌చేసి తన బామ్మర్ది బాపనయ్య ఇంట్లో దొంగతనం గురించి చెప్పి... వెంటనే ఇన్వెస్టిగేషన్ మొదలెట్టి దొంగలని పట్టుకుని సొమ్ము వసూలుచేయమని ఆదేశాలిచ్చాడు.

ఈ వార్త పేపర్లలోకి ఎక్కింది.

దీన్ని పట్టుకుని ప్రతిపక్ష సభ్యులు అసెంబ్లీలో గలాభా చేశారు.

"దొంగతనాలవల్ల ఇంతకాలం ప్రజలు బాధపడ్తుంటే ప్రభుత్వం పట్టించుకోలేదు... అటువంటిది ఇప్పుడు బాపనయ్య ఇంట్లో దొంగతనం జరగ్గానే తల్లక్రిందులు అయిపోతున్నారు... యేం! బాపనయ్య మినిష్టర్ మిన్నారావుకు బామ్మర్దనా?" ఓ ప్రతిపక్ష నాయకుడు మైకు విరిచేస్తూ ఆవేశంగా ప్రశ్నించాడు.

"ఏం?... మిన్నారావు బామ్మర్ది ప్రజల్లో ఒకడుకాడా...ఆ?..." అంటూ అధికార పార్టీ యమ్మెల్లే ఒకడు తనుకూడా మైకు విరగ్గొట్టి వైరు తెంపి, కసిగా నవ్వాడు.

అధికార పార్టీ సభ్యులంతా బల్లలమీద "ధన ధన ధన"మని చరుస్తూ... "షేం... షేం... షేం..." అని అరిచారు.

ఆ దెబ్బకి ఇందాక మైకు విరక్కొట్టిన ప్రతిపక్ష సభ్యుడు కంగారుపడి వంగి తన ప్యాంటు జిప్పువంక చూస్కున్నాడు.





జిప్పు బాగానే ఉంది.

అధికార సభ్యులంతా ఘొల్లున నవ్వి "మేం అందుకు షేమ్ షేమ్ అన్లేదుగా!..." అన్నారు.

అప్పుడా ప్రతిపక్ష సభ్యుడికి అర్థం అయ్యింది. వాళ్ళంతా ఎందుకు షేమ్.. షేమ్.. అన్నారో.

తను మైకు విరగ్గొడితే అధికార పార్టీ సభ్యుడేమో మైకు విరగ్గొట్టి వైరుకూడా తెంపేశాడు. నిజ్జంగా షేమే!

వెంటనే ఆ ప్రతిపక్ష సభ్యుడు ఆవేశంగా-

"ఏహెహెహె... హో..." అని గట్టిగా అరిచి ఆంజినీలుసామిలా గాల్లో ఒక్క గెంతు గెంతి ఆనక ఇంకో మైకు విరగ్గొట్టి దాని వైరుని ముక్కలు ముక్కలుగా తెంపేశాడు.

దాంతో తిక్కరేగిన అధికారపక్ష సభ్యులు బల్లలు విరక్కొట్టారు.

ప్రతిపక్ష సభ్యులు వాళ్ళుకూడా బల్లలు విరక్కొట్టారు.

ముఖ్యమంత్రి చిరునవ్వుతో అంతా చూస్తున్నాడు.

"మీరిట్టా చేస్తే నేను వెళ్ళిపోతానంతే! ఆ!" అన్నాడు స్పీకర్ బుంగమూతి పెడ్తూ.

ఉన్నట్టుండి ఏమైందో ఏమో... ఒక్కసారిగా బూతులు తిట్టుకుంటూ చొక్కాలు చింపుకుంటూ సభ్యులు కొట్టుకోడం మొదలు పెట్టారు.

అప్పుడు పోలీసులు రంగంలోకి దూకి వారిని అదుపులో పెట్టారు.

"అసలు మీరంతా ఎందుకు ఇలా కొట్టుకు చస్తున్నారు.?" అన్నాడు స్పీకర్ సభ్యుల వంక చూస్తూ.

"ఆ విషయమే ఇందాకట్నుండీ నేనూ అడుగుదామని అనుకుంటున్నా." అన్నాడు ఛీఫ్ మినిష్టర్ చిరునవ్వులు చిందిస్తూ.

ఆయనలా చిరునవ్వులు చిందించడానికి కారణం ఉంది. అధికార పార్టీ సభ్యులకంటే ప్రతిపక్ష సభ్యుల చొక్కాలు ఎక్కువగా చిరిగాయ్. వాళ్ళకి దెబ్బలుకూడా ఎక్కువ తగిలాయ్. పోలీసుల లాఠీ దెబ్బలుకూడా వాళ్ళకే ఎక్కువ తగిలాయ్.

కాస్సేపు సభ్యులంతా మౌనంగా ఉండి ఆలోచించడం మొదలుబెట్టారు.

ఇంతకీ తాము అందరూ ఎందుకు కొట్టుకున్నట్టు?...

మినిష్టర్ మిన్నారావు కిసుక్కున నవ్వాడు.

ఆయన నవ్వడం చూడగానే అందరికీ గుర్తొచ్చింది తామెందుకు బూతులు తిట్టుకుంటూ కొట్టుకున్నారో.




## సినీతులు

మనకు వచ్చిన పని
'ఫ్రీ'గా చేయకూడదు...
మనకు రాని పని
'ట్రై' చేయకూడదు.



"మిన్నారావు బామ్మర్ది ఇంట్లో జరిగిన దొంగ తనం గురించి పోలీసులు పట్టించుకోడానికి వీల్లేదు..." అని అరిచాడు ఒక ప్రతిపక్ష సభ్యుడు.

"పోలీసులు పట్టించుకు తీరాలి!...' ప్రతిగా అరిచాడు అధికార పార్టీ సభ్యుడు.

"పట్టించుకోడానికి వీల్లేదు." ఇంకా గట్టిగా మూడు నాలుగు గొంతులు అరిచాయ్.

"దొంగతనం జరిగితే దొంగని పట్టుకోవద్దం టారేం?" మిన్నారావు విసుగ్గా మొహం పెడ్తూ అన్నాడు.

"ఏం?... దొంగతనం మీ బామ్మర్ది ఒక్కడి ఇంట్లోనే జరిగిందా? ఊళ్ళో అందరిళ్ళలోనూ జరగడంలేదా?" ఒక ప్రతిపక్ష సభ్యుడు ప్రశ్నిం చాడు.




"దొంగతనం జరిగిన వాళ్ళు అధికార పార్టీలోని వాళ్ళకి ఎవరికో ఒకరికి బామ్మర్ది అవుతేనే పోలీసులు పట్టించుకుంటారు సార్!" మరో ప్రతిపక్ష సభ్యుడు కామెంట్ చేశాడు.

ఆ కామెంట్‌కి ప్రతిపక్ష సభ్యులంతా ఘొల్లు న నవ్వారు.

వాళ్ళలా నవ్వుతుంటే ఊర్కే కూర్చుంటే బాగుండదని అధికార పార్టీ సభ్యులు బల్లలు గుద్దుతూ "షేమ్ షేమ్..." అంటూ అరిచారు.

దాంతో రెండు పక్షాలకి సంబంధించిన సభ్యులూ మళ్ళీ వాగ్వివాదానికి దారి తీశారు.

"ఇట్టాగయితే నేనెళ్ళిపోతానంతే!" అంటూ బుంగమూతి పెట్టాడు స్పీకర్.

"ఇకముందు ఎవరింట్లో దొంగతనం జరి గినా మా పార్టీ సభ్యుల బామ్మర్దుల ఇళ్ళలో దొంగతనం జరిగినట్టుగా ఫీలయి పోలీసులు దొంగల్ని పట్టుకుని సొమ్ములు అప్పచెప్పేలా చేస్తామని హామీ ఇస్తున్నాను. అంతేకాదు... ఇక ముందు దొంగతనాలు జరక్కుండా కట్టు దిట్టమైన ఏర్పాటు చేయిస్తాం." అంటూ హామీ ఇచ్చాడు ముఖ్యమంత్రి.

ఆ రోజు అసెంబ్లీ సెషన్స్ ముగిశాక ముఖ్య మంత్రి పోలీసు కమీషనర్‌ని పిలిచి నగరం లోని దొంగతనాల గురించి చర్చించాడు. ఇకముందు దొంగతనాలు జరక్కుండా చూడ మని చెప్పాడు.

ఆ మర్నాడు పోలీసు కమిషనర్ సీనియర్ పోలీసు ఆఫీసర్ల మీటింగ్ ఒకటి పెట్టి నగరం లోని దొంగతనాలను నివారించడం గురించి చర్చించాడు.

ఈ దొంగతనాలని అరికట్టే బాధ్యత డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ డింభకరావుకి అప్పగించాడు పోలీసు కమీషనర్.

డింభకరావు ఎన్ని చర్యలు తీస్కున్నా దొంగ తనాలు జరుగుతూనే ఉన్నాయి.

ఒక విషయాన్ని గమనించిన డింభకరావుకి చాలా ఆశ్చర్యం కలిగింది. అదేమిటంటే నగ రంలో అన్నిచోట్లా దొంగతనాలు జరుగు తున్నాయ్. కానీ కొన్ని కొన్ని ప్రాంతాల్లో అస్సలు ఒక్క దొంగతనం జరగలేదు.

కారణం ఏమిటి?

అలా అస్సలు దొంగతనం జరగని ఏరి యాలు... మలక్‌పేట, సలీమ్‌నగర్, ముసా రాంబాగ్ ఇంకా కొన్ని ప్రదేశాలు!

డింభకరావు సంగతి తెల్సుకుందామని అతని ఇంటికి దగ్గర్లో ఉన్న మలక్‌పేట కాల నీకి వెళ్ళాడు.

ఆ కాలనీలోని ఒక ఇంటికి వెళ్ళి... ఇంటా యనకి తనని తాను పరిచయం చేస్కున్నాడు డింభకరావు.

"మీ కాలనీలో అస్సలు ఒక దొంగతనం



కూడా జరగలేదు... మీ కాలనీ వాళ్లేమైనా రాత్రిపూట గస్తీ తిరుగుతున్నారా?" అడిగాడు డింభకరావు ఆ ఇంటాయన్ని.

"లేదే!..." ఆశ్చర్యంగా అన్నాడాయన.

"మరి మీకాలనీలో ఒక్క దొంగతనం కూడా ఎందుకు జరగలేదు?"

"అదేంటిసార్ అలా అడుగుతారు? ఇంట్లో అందరూ గాఢంగా నిద్ర పోతున్నప్పుడు కదా దొంగలు పడ్తారు. మా కాలనీలో ఒక్కరుకూడా నిద్రపోరుగా... మరి దొంగలెలా పడ్తారు?"

"ఒక్కడుకూడా నిద్రపోడా?.. అదేం?!.." డింభకరావు ఆశ్చర్యంతో తలమునకలవుతూ అడిగాడు.

"ఎలా నిద్రపోతామండీ... మా కాలనీ దగ్గరే గా మూసీనది ఉంది. మూసీనది ఉందంటే చచ్చేన్ని దోమలు ఉంటాయ్ కదా?... ఎవడికి నిద్ర పట్టిచస్తుంది చెప్పండి. అందుకే మూసీ నది ఉన్న ఏరియాల్లో జనాలకి నిద్రపట్టదు, దొంగతనాలు కూడా జరగవు..."

అది వింటూనే డింభకరావు సంతోషంతో కెవ్వున కేకేశాడు.

దొంగతనాలు ఎలా అరికట్టాలో అతనికి తెల్సిపోయింది.

డింభకరావు పరుగునవెళ్ళి పోలీసు కమీషనర్‌కి విషయం చెప్పాడు.

పోలీసు కమీషనర్ సంతోషంతో గుండెలు బాదుకుంటూ ఛీఫ్ మినిష్టర్ దగ్గరికెళ్ళి చెవులు కొరికాడు.

"హమ్మా... ఇదా సంగతి?" అయితే ఇహ నుండి హైదరాబాద్ నగరంలో దొంగతనాలు బంద్" అన్నాడు చెవులు రుద్దుకుంటూ ఛీఫ్ మినిష్టర్.

ఛీఫ్ మినిష్టర్ ఆదేశాలతో పని వెంటనే ప్రారంభం అయ్యింది.

మూసీనది నుండి కాలవలు తీసి హైదరాబాద్‌లోని ప్రతి ప్రదేశానికి పారే ఏర్పాటు చేస్తున్నారు.

డ్రైనేజి నీరు కలిసే ఆ కుళ్ళు నీళ్ళు నగరం మొత్తం పారుతుంటె నగరం మొత్తం దోమల తో నిండి ఒక్కడికీ రాత్రిళ్ళు నిద్రపట్టదు.

ఆ విధంగా నగరంలోని దొంగతనాలు అరికట్టవచ్చని ప్రభుత్వం ఆలోచన!...



కండ్లకుంట శరత్‌చంద్ర

# హాస్యచంద్ర 001



**"ముందుగా చీమవెంట పడి స్లోమోషన్లో తరమాలి. అప్పుడది ఓ కలుగులో దూరుతుంది. కలుగు బయట చక్కెర కారప్పొడి కలిపిన మిశ్రమాన్ని ఉంచాలి... అప్పుడది చక్కెరను చూసి ఆనందంతో వచ్చి తినడం ప్రారంభిస్తుంది. కాసేపటికి అందులో కారం కలిపారన్న విషయం గ్రహించి అది అరుస్తూ ... నీటికోసం వెతుకుతుంది. అది కష్టపడి వాటర్‌టాంక్ దగ్గరికి చేరుకుని నీటిని తాగబోతుండగా ఉఫ్ అని ఊదాలి.**

**అది నీళ్ళలో పడిపోయి గిలగిల కొట్టుకుంటూ మునకలు వేస్తుంది. ఒక ఆకు తీసుకుని దాన్ని రక్షించి దాని తడి ఆరేందుకు తీసుకెళ్ళి గ్యాస్ స్టవ్ వెలిగించి ... ఒక అడుగు దూరంలో వుంచాలి. అది వెచ్చదనాన్ని అనుభవిస్తుంటే దీపావళి బాంబును తీసుకొచ్చి మంటలో వేయాలి. బాంబు ఢబేల్‌మని పేలుతుంది.**

**చీమ గాయపడుతుంది. దాన్ని తీసుకెళ్ళి ఆసుపత్రిలో చేర్చాలి. దాన్ని ఇంటెన్సివ్ కేర్ యూనిట్లో వుంచుతారు. ఎవరూ లేనప్పుడు మనం అక్కడికి వెళ్ళి దానికి పెట్టిన ఆక్సిజన్ మాస్క్‌ను తొలగించాలి.**

**అప్పుడు చీమ ఊపిరాడక చచ్చిపోతుంది!" ఇలా రాసుంటే 15 మార్కులు ఇచ్చేవాడిని" వివరించాడు ప్రహేళికరావు.**

ముగ్గురూ ఈసారి విరేచనాలతో బాధపడుతున్న గబ్బిలాలలాగా గిలగిలా తనుకున్నారు.

"మిగతా ప్రశ్నల గురించి కూడా వివరించమంటారా?!" అడిగాడు ప్రహేళికరావు.

ముగ్గురూ ఒకేసారి పైకి లేచారు. ప్రహేళికరావుకు దండాలు పెట్టి తృటిలో అక్కడ నుండి మాయమయ్యారు.

**జరిగిన కథ:** హాస్యచంద్ర ఓ ప్రైవేట్ డిటెక్టివ్. ఒక పెద్ద షాపింగ్ కాంప్లెక్స్‌లో భార్య తప్పిపోతే కంగారు పడుతున్న ఒకతనికి మాస్టర్‌ప్లాన్ వేసి అతని భార్య అక్కడికి చేరుకునేట్లు చేస్తాడు హాస్యచంద్ర. ఈ సంఘటన చూసిన చాలామంది హాస్యచంద్ర ఫోన్ నెంబరు తీసుకుంటారు. ప్రహేళికారావు- తన కూతురు వెంట ప్రేమిస్తున్నామంటూ ఎవరైనా పడుతున్నారా కనిపెట్టమని హాస్యచంద్రకు ఫోన్ చేస్తాడు. ఆ కుర్రాల లిస్ట్ తీసుకొచ్చి ప్రహేళికారావుకిస్తాడు హాస్యచంద్ర. ఆ కుర్రాలను పిలిపించి వారందరిచేత తన ఇంట్లో నానా రకాల చాకిరి చేయిస్తాడు. వారందరికీ ఓ పరీక్ష కూడా పెడతాడు. **-ఇక చదవండి**

"అసలూ మనమే తప్పు చేశాం. వీళ్ళతో మనకు ఛాయ్ తయారు చేయించుకుని రాత్రి భోజనం వడ్డించుకుని, వచ్చే మూడు రోజులకు సరిపడా కూరగాయలన్నీ తరిగించుకుని, పిండిగ్రా రుబ్బించుకుని అప్పుడు ఆన్సర్ షీట్స్ ఇచ్చుంటే బాగుండేది." అన్నాడు ప్రహేళికరావు.

"చాల్లేండి సంబడం!" అంది సురభి.

"ఇహ ఛస్తే వీళ్ళెవ్వరూ మన అమ్మాయి జోలికి రారు" అన్నాడు ప్రహేళికరావు.

"అయితే ఆ సమయంలో తథాస్తు దేవతలు లేకపోవడం చేత ఇప్పుడు వెళ్ళిన ముగ్గురికీ ఇంకా జ్ఞాన దంతాలు రాకపోవడం చేత ప్రహేళికరావు అన్న చివరివాక్యం నిజమయ్యే అవకాశం లేదు.

సురభి, సమత ఆఫీసుకు ఫోన్‌చేసి జరిగిన రాత పరీక్ష తాలూకు తతంగం కూతురికి వివరిస్తుంటే... అక్కడ సమత పడిపడీ నవ్వ సాగింది.



నారాయణగూడా దగ్గరున్న తాజ్‌మహల్ హోటల్లోకి అతిథులు ప్రవేశిస్తున్నారు.

"పి. పీతాంబరం- పద్మజ మ్యారేజ్ సిల్వర్ జూబ్లీ ఫంక్షన్‌కు వెల్‌కమ్" అని రాసి వున్న బోర్డును చదువుతూ హాస్యచంద్ర, సమత, రాము లోపలికి అడుగుపెట్టారు.

"చూస్తుంటే చాలామంది వున్నారు. నాకు తెల్సిన వాళ్ళెవ్వరైనా వుంటే, మన విషయం మా నాన్నకు తెలుస్తుంది" అంది సమత భయంభయంగా.

హైదరాబాద్‌కు విహారయాత్రకోసం వచ్చిన

ఇద్దరు తథాస్తు దేవతలు ఆమె అన్న వాక్యం విని, 'తథాస్తు' అనేసి చార్మినార్ వైపు సాగి పోయారు.

"ఇప్పటికీ నువ్విలా అనడం వందోసారి". అన్నాడు హాస్యచంద్ర.

"ఇదే భయంతో రమ్య రాలేదు... మనం టెన్షన్ వదిలేసి పార్టీని ఎంజాయ్ చేస్తే బావుం టుంది" అన్నాడు రాము.

ముగ్గురూ పార్టీ జరుగుతున్న హాల్లోకి వెళ్ళి కుర్చీల్లో కూర్చున్నారు.

వేదిక మీద నేరేడు పండు రంగులో వున్న పీతాంబరం, తెల్లటి సూట్‌లో... నిమ్మపండు రంగులో వున్న పద్మజ ఎర్రటి పట్టుచీరలోను ధగధగ మెరిసిపోతున్నారు.

పీతాంబరం గొంతు సవరించుకుని "పెద్ద పెద్ద ఇళ్ళు కడుతున్నాం... కానీ కుటుంబాలు మాత్రం చిన్నవి అయిపోయాయి. పెద్ద పెద్ద డిగ్రీలు సంపాదిస్తున్నాం. కానీ ఇంగితజ్ఞానం తక్కువైపోతోంది... చంద్రుడ్ని అందుకున్నాం కానీ మన పక్క ఫ్లాట్‌లో ఎవరుంటారో తెలీదు. రెండు చేతులా సంపాదిస్తున్నాం. కానీ మన శ్శాంతి తక్కువ. ఎక్కువ విజ్ఞానాన్ని పొందు తున్నాం. కానీ తెలివితేటలు తగ్గుతున్నాయ్. ఆల్కహాల్ బాగా వాడుతున్నాం. కానీ నీళ్ళు తక్కువ తాగుతున్నాం.... మనషుల సంఖ్య పెరుగుతోంది. కానీ మానవత్వం తగ్గుతోంది. ఖరీదైన గడియారాలు కొంటున్నాం. కాని సమయం లేదు. ఇది ఈ రోజు వాస్తవం. అయితే ఈ వాస్తవాన్న మేమిద్దరం పాతికేళ్ళ క్రితమే గుర్తించాం. దేనికి విలువివ్వాలో, దేనికి విలువివ్వకూడదో ఎప్పటికప్పుడు చర్చించు కుంటూ... అప్పుడప్పుడు గిల్లికజ్జాల్ పెట్టు కుంటూ ప్రశాంతంగా బ్రతుకుతున్నాం.

ఇక్కడికొచ్చిన వారందరికీ... వారి సమయా నికి ధన్యవాదాలు చెపుతూ... పార్టీని ఎంజా య్ చేయమని కోరుతున్నాం" అన్నాడు.

ఆ తర్వాత 25 అనే సంఖ్య వేసిఉన్న హృద యాకారపు ఫ్రూట్ కేక్‌ను, ప్లాస్టిక్ కత్తితో కట్ చేసి దంపతులిద్దరూ ఒకరికొకరు తినిపించు కున్నారు.

ఆ తర్వాత అతిధులు వేదికపైకి వెళ్ళి గిఫ్టులు ఇచ్చి... డైనింగ్ ఏరియా వైపు నడవ సాగారు.

హాస్యచంద్ర, రాము, సమత వేదిక పైకి వెళ్ళారు. ముగ్గురూ ప్యాక్ చేసి వున్న రాధా కృష్ణుల విగ్రహాన్ని వారికిచ్చారు.

## సినీతులు

**కన్నతల్లిని, గుడిలో దేవుణ్ణి మనమే వెళ్ళి చూడాలి. వాళ్ళు మన దగ్గరకు రావాలనుకోవటం మూర్ఖత్వం.**



"పద్మా! మన కంపెనీలో చేరే కొత్త ఉద్యోగుల బయోడేటా తీసుకుని బేక్‌గ్రౌండ్ చెక్ చేయిస్తాం కదా.... చెక్ చేసే డిటెక్టివ్ ఇతడే హాస్యచంద్ర! ఇతను రాము, హాస్యచంద్ర అసిస్టెంటు. ఈ అమ్మాయి... " సమతవైపు చూసి ఆగిపోయాడు పీతాంబరం.

"సర్! ఈ అమ్మాయి..." అంటూ హాస్యచంద్ర నసగసాగాడు.

"మీరు నసగడంలోనే ఆమె మీకేమవుతుందో అర్థమవుతోంది!..." అంది పద్మజ నవ్వుతూ.

"వావ్! మొత్తమ్మీద నువ్వు సెటిల్ అవబోతున్నావన్న మాట... వెళ్ళి భోంచేయ్యండి." అన్నాడు పీతాంబరం.

ముగ్గురూ వేదిక దిగి వెళుతుంటే...

"ఓ సంధ్యావందనంగారూ! మీరొచ్చినందుకు థ్యాంక్స్" అని పీతాంబరం గొంతు వినిపించింది.

సమత, హాస్యచంద్ర భుజం మీదనుండి ఓరకంటితో సంధ్యావందనం కేసి చూసింది.

సంధ్యావందనం పీతాంబరానికి షేక్‌హ్యాండ్ ఇస్తూనే, సమత, హాస్యచంద్రల వంక సీరియస్‌గా చూసాడు.

సమత వెంటనే పక్కకు తప్పుకొని భయం భయంగా వణికిపోసాగింది.

"ఏమైంది?? ఏ.సి. తగ్గించమని చెప్పాలా!" అడిగాడు హాస్యచంద్ర.




"సంధ్యావందనం!" అంది.

"సంధ్యావందనమా! అంటే సంధ్యకు వందనం... అంటే సూర్యుడికి నమస్కారం. ఇప్పుడు సూర్యుడికి నమస్కారమెందుకు అడిగాడు రాము.

"ఏహే కాదు... సంధ్యావందనం అంకుల్ వచ్చారు. నన్ను చూసేశారు" అంది టెన్షన్ పడుతూ.

అయితే సంధ్యావందనం వాళ్ళను ఏ మాత్రం పట్టించుకోకుండా, డిన్నర్ చేసేందుకు బఫే వైపు వెళ్ళిపోయాడు.

"అదిగో ఆయనే!..." కళ్ళతోనే ఇద్దరికీ చూపించింది.

"ఆయన నిన్ను చూడలేదనుకుంటాను... అనవసరంగా టెన్షన్ పడకు. ఆయనకు కాస్త దూరంలో నిలబడి భోజనం చేసి వెళ్ళిపోదాం!" చెప్పాడు హాస్యచంద్ర.

ఆ తర్వాత ముగ్గురూ బఫే వైపు కదిలారు.

ప్లేట్లలో పదార్థాలు వడ్డించుకుని ముగ్గురూ గుంపుగా ఉన్న పదిమంది అతిథుల వెనుక నిలబడి తినసాగారు.

సమత మాత్రం టెన్షన్‌తో ఏమీ తినకుండా భయపడుతూనే వుంది.

"అబ్బా! ఏమిటి టెన్షన్. ఇప్పుడు సంధ్యావందనాన్ని ఇక్కడ నుండి పంపించేయాలి. అంతే కదా!!" అని హాస్యచంద్ర రాము చెవిలో ఏదో చెప్పాడు.

రాము తలూపి సంధ్యావందనం దగ్గరకు వెళ్ళి అటు ఇటు చూస్తూ ... తన ప్లేట్లో వున్న సూపును తీసి సంధ్యావందనం ఫ్యాంట్‌మీద పోసాడు.

"అరే... సారీ సర్! చూసుకోలేదు" అన్నాడు రాము.

"చూడు నాయనా!... నువ్వు చూసుకుని పోశావో, చూడకుండా పోశావో నాకు తెలీదు. నీకు మూడు విషయాలు చెప్పాలనుకుంటున్నాను. మొదటిది ఈ భోజనం పూర్తయ్యేదాకా నేను ఇక్కడ నుండి కదలను. రెండవది, నేను సమతను మీతో చూశాను. మూడవది, ఇంటి



కి వెళ్ళీ వెళ్ళగానే ఈ విషయం కచ్చితంగా ఆమె తండ్రితో చెప్పి తీరతాను. అంచేత ... నువ్వు సూపులు, కూరలూ గట్రా నా ఫ్యాంట్ మీద పోసే ఆలోచనలు మానేసి వెళ్ళి భోజనం చేయి. దీని తస్సాదియ్యా వీడెవడో మిరప కాయ బజ్జీలు భలే చేశాడయ్యా!!" చెప్పి మిర్చి బజ్జీని కసాబిసా నమలసాగాడు.

రాము ఏడుపు మొహం వేసుకొని వెనక్కి తిరిగివచ్చాడు.

"ఏమైంది?!" సమత టెన్షన్‌తో అడిగింది.

రాము సమాధానం చెప్పే లోపలే పీతాం బరం, పద్మజ ఆదుర్దాగా వాళ్ళ దగ్గరకొచ్చారు.

"హాస్యచంద్ర!... మా ఆవిడ వేలికున్న డైమండ్ రింగ్ పోయింది!!" చెప్పాడు పీతాం బరం మెల్లిగా.

"అయ్యయ్యో! కింద పడిపోయిందేమో వెతికారా?"

"వెతికాం....వేదిక మీదకు ఎక్కినప్పుడు వుంది. ఇప్పుడు లేదు!" చెప్పింది పద్మజ, ఆందోళనగా.

"అంటే... ఎవరైనా కొట్టేసుంటారనా మీ అనుమానం."

"కచ్చితంగా ! కానీ ఎవ్వరయ్యుంటారు?!"

"సరే! నేను కనిపెడతాను. మీరేం వర్రీ అవ్వ కండి". చెప్పాడు హాస్యచంద్ర తన ప్లేటును ఓ కుర్చీలో పెట్టి నాప్‌కిన్‌తో చేతిని తుడుచు కుంటూ.




"కానీ వచ్చిన వాళ్ళందరూ... కంపెనీలో టాప్ పొజిషన్‌లో ఉన్న ఉద్యోగులు, మిత్రులు, దగ్గరి బంధువులు. వాళ్ళలో ఎవరిని అనుమా నిస్తాం. చెక్ చేస్తామంటే పార్టీకి పిలిచి అవమా నించినట్లవుతుంది" అన్నాడు పీతాంబరం.

"ఆ డైమండ్‌రింగ్ మా పెళ్ళప్పటిది. దాని కున్న డైమండ్ విలువ కంటే... పాతికేళ్ళపాటు నేను దాన్ని దాచుకున్న... జ్ఞాపకాల విలువ ఎక్కువ" అంది పద్మజ.

"నేను జాగ్రత్తగానే హ్యాండిల్ చేస్తాను. మీరు ప్రశాంతంగా వుండండి." చెప్పి హాస్యచంద్ర వేదిక మీదకెక్కి మైకు అందుకున్నాడు.

"లేడీస్ అండ్ జెంటిల్‌మెన్! మీలో చాలా మందికి నేను తెలియకపోవచ్చు. నేను డిటెక్టివ్ ను పేరు హాస్యచంద్ర. డిటెక్టివ్‌గా నేనంటే ఏంటో మీ అందరికీ నిరూపించుకోవడానికి నాకు ఇప్పుడొక అవకాశం వచ్చింది....

బైదబై మన హోస్ట్ మిసెస్ పీతాంబరం గారి డైమండ్ రింగ్ పోయింది. అదేక్కడుందీ కనిపెట్టి వారికిస్తాను. ఒకవేళ ఎక్కడైనా కింద పడిపోయి కన్పిస్తే దాన్ని పద్మజ గారికి ఇవ్వండి. రాము!... నువ్వెళ్ళి మెయిన్ డోర్ దగ్గర చెయిర్ వేసుకొని కూర్చో" చెప్పి కామ్‌గా కిందకు దిగి వెళ్ళి తన ప్లేట్ తీస్కుని తిన సాగాడు.

రాము ఓ కుర్చీని డోర్ దగ్గరలో వేస్కుని అందులో కూర్చుని తింటూ ... అందర్ని గమనించసాగాడు. **(సశేషం)**









# హతః కుంజరః

భీమరాజు వెంకట రమణ
98492 39945

**శంకర్రావు వికటాట్టహాసం చేస్తున్నాడు. పాత సినిమాల్లో రాజనాలలాగా. ఆ నవ్వులో విజయ గర్వం. ఆ నవ్వులో తన కుటిల పన్నాగం ఫలించిందన్న పరమానందం. పుత్రరత్నం మోహన్ నోరెళ్ళబెట్టి చూస్తున్నాడు.**

**ఇలాంటి సుదీర్ఘ నవ్వు వాళ్ళనాన్న ఇరవై సంవత్సరాల క్రితం ఒకసారి నవ్వాడు. తను పదవ తరగతి పరీక్ష రెండుసార్లు తప్పి మూడవసారి రాసినప్పుడు, స్లిప్పులు ఎక్కడ పెట్టుకొని చాకచక్యంగా ఎలా కాపీకొట్టాలో మంచి తర్ఫీదు ఇచ్చి, పరీక్ష గట్టెక్కేట్లు చేసి, ఫలితాలు వచ్చినరోజు పేపర్లో నెంబరు చూసి నవ్విన నవ్వు... మళ్ళీ ఇన్నేళ్ళ తరువాత అదే నవ్వు.**

రెండు నిముషాలు ఏకబిగిన నవ్వి ఇక ఆయాసంతో నవ్వలేక ఆపాడు శంకర్రావ్.

అప్పుడు అడిగాడు మోహన్ "ఏంటినాన్నా విశేషం! అంత గట్టిగా నవ్వుతున్నావ్? అని.

మహదానందంగా కొడుకు భుజాలపై చెయ్యి వేసి "మనం మొన్న చూసొచ్చిన సంబంధం ఖాయమైయిందిరా! వాళ్ళు ఒప్పుకున్నారుట. ఇప్పుడే పెళ్ళిళ్ళ పేరయ్య ఫోన్ చేసాడు" అన్నాడు.

మోహన్‌కి మొదట కాసేపు ఆనంద ఆశ్చర్యాలు విపరీతంగా కలిగాయి. కానీ దాని తాలుకు భావప్రకటన మాత్రం అతని ముఖం నుంచి చటుక్కున మాయమైపోయింది.




"అదేంట్రా ముఖం అలా పెట్టావ్?... పెళ్ళి కుదిరినందుకు ఎగిరి గంతెయ్యక" అన్నాడు శంకర్రావ్.

"ఏమో నాన్న నాకు భయంగా ఉంది. నాకు రైల్వేలో ఉద్యోగమని వాళ్ళకు చెప్పావ్! నేనేమో జనాలకి సంబంధించిన పార్సిళ్ళు రైల్లో బుక్ చేసే ప్రైవేటు ఏజెంట్‌ని, నువ్వేమో ఏకంగా రైల్వేపార్సిల్ ఆఫీసులో ఉద్యోగం అని అబద్ధం చెప్పావ్! రేపు నిజం తెలిస్తే ఎలా?"

"ఓరి పిచ్చి సన్నాసీ! అసలు ఆ రోజు ఎలా చెప్పాను?... మీ వాడు ఎక్కడ పనిచేస్తున్నాడు అని వాళ్ళు అడిగారు "సికింద్రాబాద్ రైల్వే స్టేషన్ లో" అన్నాను. 'ఏ ఆఫీస్‌లో' అనడిగారు. 'పార్సిల్ ఆఫీసులో' అని పెద్దగా చెప్పి 'ప్రైవేటు ఏజెంటుగా' అని మెల్లగా చెప్పా!"

"వాళ్ళకు అది వినపడినట్లు లేదు నాన్నా!"

"వినపడకూడదనేరా అలా చెప్పింది, అశ్వద్ధామ హతః కుంజరః లాగా అనమాట. ఆపద్ధర్మం తప్పు లేదురా.... వెయ్యి అబద్ధాలాడైనా ఒక పెళ్ళి చెయ్యమని మన పెద్దవాళ్ళు సెలవిచ్చారు. నేను ఒకే అబద్ధం, అదీ ధర్మరాజు ఫార్ములా ప్రకారం ఆడాను. ఒకప్పుడు నీకు కాపీ కొట్టడంలో తర్ఫీదు ఇచ్చి పదో తరగతి పాస్ అయ్యేట్లు చేసాను. ఇప్పుడు కాస్త లౌక్యం ప్రదర్శించి నీకు పెళ్ళి అయ్యేలా చేస్తున్నాను. ఇందులో తప్పేమీ లేదు."

"వాళ్ళెవరైనా వచ్చి ఎంకొయిరీ చేస్తే?..."

"ఓరి! అమాయక శిఖామణీ! ఎంతమంది తల్లిదండ్రులు చేసుకోబోయే అల్లుడి గురించి పూర్తిగా తెలుసుకుంటున్నారు? అలా చేస్తే గూఢచారి పని చేసి అవమానించినట్లు అతను ఫీలౌతాడేమో అని వీళ్ళు ఫీలయి సరిగా వివరాలు కనుక్కోరు. ఇలా చాలామంది పప్పులో కాలేస్తుంటారు... సరే! నీకెటూ సందేహం వచ్చింది కాబట్టి ఒక పని చెయ్! పెళ్ళయిందాకా రోజూ పని ఉన్నా లేకపోయినా ఆ రైల్వే పార్సిల్ ఆఫీసు దగ్గరే తిరుగుతుండు. అక్కడ స్టాఫ్‌తో ఏదో ఒకటి మాట్లాడుతుండు. వీలైతే ఖాళీగా ఉన్న కుర్చీల్లో కూర్చో! అమ్మాయి తాలూకు వాళ్ళెవరైనా వచ్చినా నిన్నక్కడ చూసి తృప్తిగా వెళ్ళిపోతారు! ఏమంటావ్?"

"ఎప్పటికైనా నిజం తెలిస్తే?"

"ఏమీ జరగదు! శుభ్రంగా సర్దుకుపోతారు! మన సాంప్రదాయం అదే కదరా? అంతెందుకు మీ అమ్మ సర్దుకుపోలా? ఏ లోకంలో ఉన్నదో మహా ఇల్లాలు..." అన్నాడు ఆకాశం వైపు చూస్తూ.

"నువ్వెన్నైనా చెప్పు! నాకు భయంగా ఉంది. అన్నీ సంబంధాలలాగే ఇది కూడా తప్పిపోతుందనుకున్నాను...కానీ కుదిరింది. లోపల దడగా ఉంది."

"ఒరేయ్! ఈ అవకాశం చేజార్చుకున్నావంటే ఇక నీకు ఈ జన్మలో పెళ్ళికాదు. అసలే అమ్మాయిలు తక్కువై అబ్బాయిల తల్లిదండ్రులు తలలుపట్టుకు కూర్చున్నారు. రాబోయే రోజుల్లో రోడ్డుమీదపొయ్యే అమ్మాయిల్ని కిడ్నాప్ చేసి మరీ తమ కొడుకులకిచ్చి పెళ్ళిచేసుకున్నా ఆశ్చర్యం లేదు! అంతకన్నా మనం చేసేది చాలా నయం.... ఇక నువ్వు అనవసరంగా వాదించక నేను చెప్పినట్లు చేస్తూ ఉండు... జరిగేది చూస్తూ ఉండు! సరేనా?"

చేసేది లేక తలూపాడు మోహన్.

తండ్రీకొడుకులిద్దరూ పెళ్ళిదాకా అన్ని జాగ్రత్తలూ తీసుకున్నారు. పెళ్ళికి ఇరుపక్షాలకు తెలిసిన వాళ్ళు వస్తే బండారం బయట పడుతుందని పెళ్ళి గుళ్ళో సింపుల్‌గా జరిగేట్లు చేసారు. అదేమంటే ఆడపెళ్ళివారిచేత అనవసర ఖర్చు పెట్టించకూడదనేది తమ వంశాచారం అని నమ్మించారు.

అనుకున్నట్లు పెళ్ళి జరిగిపోయింది.

శోభనం గది ఉన్నంతలో బాగానే అలంకరించబడింది.

మోహన్ గుండెల్లో ఆనందము ఆందోళనతో కూడిన విచిత్ర మానసిక స్థితి. నిజానికీ పెళ్ళి జరిగినంతసేపూ అతనికి అలానే ఉంది, ఎప్పటికప్పుడు శంకర్రావు ధైర్యం చెబుతూ నెట్టుకొచ్చాడు.... కానీ ఇప్పుడు శంకర్రావు అక్కడలేడు....ఉంటే బావుండదు గూడాను. ఆమె కోసం ఎదురుచూస్తున్నాడు మోహన్.

కాసేపటికే ఆమె పాల గ్లాసుతో అడుగు పెట్టింది.

తన భార్య తలవంచుకొని సిగ్గుపడుతూ వస్తుందనుకున్నాడు. కానీ అలాంటివేవీ అక్కడ కనపడలేదు. ఆమె ముఖంలో ఏ

## సినీతులు

పెళ్ళి అనేది ఒక తలుపు ఉన్న గది లాంటిది... పెళ్ళికాని వారందరూ అందులోకి ఎప్పుడు వెళ్దామా అని చూస్తుంటారు... పెళ్ళి అయినవాళ్ళు ఎప్పుడు బయటపడదామా అని చూస్తుంటారు.



నదురూ, బెదురూ లేదు. నిజానికి ప్రస్తుతం మోహన్ ఆ పరిస్థితిలో ఉన్నాడు.

ఆమె చిరునవ్వు చిందిస్తూ మోహన్ దగ్గరకు వచ్చింది. ఏదో పాత స్నేహితుణ్ని చూసినట్లు షేక్‌హ్యాండ్ ఇచ్చి కూర్చుంది. తను అను కున్నట్లు తన భార్య ప్రవర్తించటం లేదు. ఆమే భర్త తనే భార్య అన్నట్లున్నాయి వారి హావ భావాలు.

ఈ కాలం అమ్మాయిలు అంతేలే అని మనసును సమాధానపరుచుకున్నాడు. తన హుందాతనం చూపెడుతూ ఏదోఒకటి మాట్లా డాలనుకొని "ఫరవాలేదు గట్టిదానివే! నన్ను చూసి కాస్త బెదురుతావనుకున్నా!" అన్నాడు రొమాంటిగ్‌గా చూస్తూ.

"నేనేం కాదు నిజానికి మీరే కాస్త బెదురుగా, అధైర్యంగా కనపడుతున్నారు" అన్నది ఆమె చిలిపిగా చూస్తూ.

ఆమె చలోక్తికి మోహన్‌కి రోషం వచ్చింది.

"అధైర్యమా?... మా ఇంటా వంటా లేదు" అన్నాడు గర్వంగా.

"అయితే నేనొక చిన్ని కథ చెబుతా! ధైర్యం గా వినగలరా?" అన్నదామె కొంటెగా చూస్తూ.

"చెప్పి చూడు!" అన్నాడు మోహన్ ఠీవిగా.

ఆమె కాసేపు ఆలోచించి "కథలకు ఇప్పుడు సమయం కాదులెండి! రేపు చెబుతా" అంటూ లైట్ ఆఫ్ చేసింది.

తెల్లారింది.




కాఫీగ్లాసు చేతపట్టుకొని నిద్రలేపిన భార్యను చూస్తూ రాత్రి చెబుతానన్న చిన్న కథేమిటి అడిగాడు మోహన్ ఉత్సాహంగా.

ఆమె సావధానంగా కూర్చొని ఆ కథ ఎంతో వివరంగా చెప్పింది.

మోహన్ ఉత్కంఠ భరితంగా విన్నాడు.

కానీ అది కథ కాదు ఆ రూపంలో ఉన్న ఆమె బయోడేటా. అది విని మోహన్ కళ్ళు బయర్లు కమ్మి అలాగే మంచం మీద వెనక్కి పడిపోయాడు. బాక్సింగ్‌రింగ్ లో ప్రత్యర్థిని పడగొట్టినట్లు విజయగర్వంతో ఆమె గది లోంచి చిరునవ్వు చిందిస్తూ వెళ్ళిపోయింది.

కాసేపటికి తెప్పరిల్లి లేచిన మోహన్ హడావిడిగా వాళ్ళ నాన్నకు ఫోన్ చేసాడు–

"నాన్నా! కొంప మునిగింది ఈ అమ్మాయికి ఇంతకు ముందు ఒకసారి పెళ్ళైందిట, ఈమె సతాయింపు భరించలేక అతగాడు విడాకు లిచ్చి మరీ దుబాయ్ పారిపోయాట్ట, వీసా గడువు అయిపోయి వాళ్ళు జైల్లో పెట్టినా సరే అక్కడే ఉంటాను గానీ ఇండియాకు ఈ జన్మ లో రానని శపథం కూడా చేసాడుట".

శంకర్రావు గొంతులో తడారిపోయింది.

ఎలాగో పెళ్ళగించి– "ఇదే తన మొదటి పెళ్ళిచూపులని చెప్పింది కదరా?" అన్నాడు.

"ఇదే మొదటి పెళ్ళి చూపులు అని చెప్పి 'విడాకులు తరువాత' అనికూడా చెప్పిందిట. 'ఆ మాట మాకు వినపడ్లేదే? అంటే 'దానికి నేనేం చేసేది' అంటున్నది. మనం చూపిన తెలివే అదీ చూపింది. అశ్వద్ధామ హతః కుంజరః లో చచ్చిన కుంజరం లాగా అయింది నా పని! అది గుండెలు తీసిన బంటు నాన్నా! తేనెపూసిన కత్తి! వచ్చి వచ్చి పెద్ద ఊబిలో ఇరుక్కున్నాం నాన్నా!" అని భోరుమన్నాడు.

విషయం ఆసాంతం విన్న శంకర్రావు ఎప్ప టిలాగే మళ్ళీ నవ్వాడు. నవ్వుతూనే ఉన్నాడు.

అయితే ఈసారి రాజనాలలాగా కాదు.... గుమ్మడిలాగా నీరసంగా, దిగులుగా, వైరా గ్యంగా నవ్వుతున్నాడు....

నవ్వుతూనే ఉన్నాడు!!!






**ఎంచక్కా పెళ్ళాడి పిల్లల్ని కని సుఖపడమంటారు పెద్దలు....**

**పెళ్ళి చేసుకుని సుఖపడ్డ మగాడ్ని చూపించమంటాడు శివుడు.**

**శివుడ్తో ఎప్పుడూ ఇదే పేచీ. ఎడ్డెమంటే తెడ్డెమంటాడు. నా ఈడు వాడే. పెళ్ళిపెటాకుల్లేకుండా బ్రహ్మచారిగా బతుకు లాగించేస్తున్నాడు. పెళ్ళాడిన వాళ్ళం దర్నీ నోటికొచ్చినట్లు తిట్టి పోయడం వాడి హాబీ.**

**అట్లా తిట్టిపోస్తూ, కనీసం ఒక్కడ్నైనా సన్యాసిగా తయారుచేయాలన్నది వాడి జీవితాశయం.**

పెళ్ళాం పిల్లలున్నవాళ్ళం నిజానికి శివుడ్తో స్నేహం చేయకూడదు. పొరపాటున శివుడి మాజిక్కు – మా మీద పనిచేస్తే వంటికి కాషాయవస్త్రాలూ, కాళ్ళకి పాంకోళ్ళు, చేతికి కమండలం వచ్చి హరోంహర అంటూ హిమాలయాలకు వెళ్ళే ప్రమాదం ఎంతైనా ఉంది. అంచేత శివడ్ని బాగా దూరంగానే వుంచాలి. కానీ – చిన్నప్పట్నుంచి కలిసి



మెలిసి తిరిగిన వాళ్ళం. ఇప్పుడు వాణ్ని ఛీ పొమ్మంటే కళ్ళు పోతాయని భయం.

శివుడి థియరీ టూకీగా వివరిస్తాను.

యావత్తు సృష్టిలో అతి మంచివాడు మగాడు. ఎంత మంచివాడో అంత అమాయకుడు. జేబులో వంద కాగితముంటే అతన్ని పట్టుకోడం కష్టం. కోటీశ్వరుడి ఫోజులో వుంటాడు. ఆ డాబుసరితనాన్ని చక్కగా వాడుకొనే నేర్పు ఒక్క ఆడ దానికే వుంది.

జీతాలిచ్చిన రోజు ఏ ఇంట్లో చూడండి... మగాళ్ళచేత గుంజీలు తీయిస్తూంటారు ఆడంగులు.

ఫస్టు తారీఖున కట్టుకున్న భార్య మహా చక్కగా మస్తాబవుతుంది. శ్రీవారికి స్వాగతం పలికి మంగళహారతులిస్తుంది. గొప్ప హీరోవి అంటుంది. స్నానానికి నీళ్ళుతోడి వీపు రుద్దుతుంది. అతని కిష్టమైన కూరలు చేసి స్వయంగా తినిపిస్తుంది. కళ్ళతో నవ్వుతుంది. నోటితో కవిత్వం పలుకుతుంది.

ఆ విన్యాసానికి మగమహారాజు మెదడ్ని పోగొట్టుకుంటాడు. ఆ కిక్కులో తన పర్సు భార్యకిస్తాడు.

గోవింద!... మరుసటి రోజునుంచి ఆటో ఎక్కాలన్నా, సిగరెట్టు కొనుక్కోవాలన్నా ఆవిడ్ని బెదిరించవలసిందే. పావలా అర్ధా చేతిలో పెట్టి 'ఈ సంసారం చేయలేను బాబూ...' అంటూ ఆపసోపాలు పడిపోతుంది అర్ధాంగి.

నిజం కాబోసనుకుంటాడు మగాడు –

ఈ మగాడు ఏ హోదాలోనైనా వుండొచ్చు. అతని మేధావితనానికి యావన్మంది మూర్ఛ

సినీతులు

**బాగుండటం అంటే**
**'బాగా' ఉండటం కాదు...**
**నలుగురితో ఉండటం...**
**నవ్వుతూ ఉండటం.**



పోవచ్చు. శతవిధాల వెలిగిపోతున్న ఆ మాన వుడు ఒక ఆడదాని చేతిలో అష్టరాల్ కీలు బొమ్మ అనే నగ్న సత్యాన్ని అందరూ అంగీ కరించవలసిందే.

బల్బులాంటి వాడు మగాడు... వాళ్లావిడి మెయిన్ స్విచ్. బల్బు వెలిగినా ఆరిపోయినా అదంతా స్విచ్ మహిమ. వెలిగే మగాడు అదంతా సొంత ప్రయోజనత్వమని మురిసి పోతే... అంతకంటే మూర్ఖత్వం మరొకటి వుండదు.

హా నాథా!... ప్రాణేశ్వరా అంటూ వాళ్లావిడ రికార్డు పెడితే మగాడు వీరుడవుతాడు.

పోదురూ – మీ బడాయి నాకు తెలీంది కాదని వాత పెడితే అంతవీరుడూ చప్పగా చల్లారిపోతాడు.




ఆఫీసులో మీ పై వాడు సాక్షాత్తూ అగ్గి రాముడే కావచ్చు. కరిచేస్తా, నమిలేస్తా, మింగే స్తా, కరిచి నమిలి మింగేస్తానని గంతులు వేయవచ్చు.

శ్రీవారి ఇంటికి వెళ్ళి వారియొక్క పొజిషను చూడండి. కడుపు తరుక్కుపోతుంది. వాళ్ళా విడ ముందు మ్యావ్... మ్యావ్‌మంటూ పిల్లి కూతలు ప్రాక్టీసు చేసుకుంటూ ఉంటాడు.

అల్లాంటి శ్రీవారితో మనకేదైనా పని పడితే వారినడిగి ప్రయోజనం లేదు... వుండదు. నను బ్రోవమని చెప్పవే. నా తల్లి సీత నను బ్రోవమని చెప్పవే అంటూ శ్రీ రామదాసుగారు భజనొకటి మగజాతికి నేర్పి పున్నెం కట్టు కున్నారు. అంచేత పాలో, పళ్ళో శ్రీవారింటికి తీసుకెళ్ళి అమ్మగారికి చేతులు జోడిస్తే చాలు. ప్రమోషనో, సొంత ఊరికి బదలీనో తప్పని సరిగా జరిగి తీరుతుంది.

ఇప్పుడు చెప్పండి. మగాడు ఆడదాని కంటే ఏ విధంగా గొప్పవాడు?

అయినా...

సమాన హక్కులు కావాలని స్త్రీజాతి బోర్డు లు కట్టుకు తిరుగుతున్నారంటే ఏమిటర్థం? అక్కడికి హక్కుల అధికారాల్తో మగాడు పేట్రేగి పోతున్నాడనేగా!... ఇది శోచనీయమైన సందర్భం. మగాడికి ఏ కొంచెమైనా మెద డుంటే, దాన్నికూడా సర్వనాశనం చేసేటం దుకు ఈ నినాదాలు బాగా పనిచేస్తాయి.

నిజం మాట్లాడవలసి వస్తే మగాడు ఆడ దని చేతిలో దెబ్బలు కూడా తింటున్నాడు. కాల్తో కొట్టినా, చెంప చెళ్ళుమనిపించినా ఆడజాతికే చెల్లు.

మన పురాణాలు కూడా ఈ ముక్కనే సెలవి చ్చాయి. సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మనే కాల్తో కొట్టింది వాళ్ళావిడ. దేవుడే దెబ్బ తిన్నప్పుడు మానవ మాత్రులం మనమెంత?

ఆడవాళ్ల దెబ్బల్లో ఒక ట్రిక్కుంది. కొడు తున్నామని చెప్పి కొట్టరు.

శృంగార విన్యాసంలో ఒక భాగమనుకొని చెంపలు వాయిస్తారు.... పిడి గుద్దులు గుద్ద తారు.... అన్ని దెబ్బలు తినికూడ కోపంతోనే కొట్టిందని తెలిసి కూడా మగాడు సర్దుకు పోతాడు. తిరగబడితే మరిన్ని దెబ్బలు తినా లనే భయంతో కావచ్చు. అందరికీ తెలిస్తే అవమానాగ్నిలో కాలిపోతామనే దిగులుతో కావచ్చు! వెర్రిచూపులు చూస్తాడంతే.

కొంచెం చతురుడైతే తనకి తగిలిన దెబ్బలు బాధని ఓర్చుకొని కవిత్వం చెబుతాడు. ఏవని?...

అలివేణీ... నా గుండెల్ని తాకిన నీ లేత పాదం క్షేమమే గదా అంటాడు. లతాంగీ నా చెంపల్ని నిమిరిన తమలపాకులాంటి నీ



చెయ్యి కందిపోలేదు కదా! అని కూడా అంటాడు. వెధవ డిప్లొమసీ!

అది ముందు పుట్టి ఆనక మగాడు పుట్టేడు.

అల్లాంటి అర్భకుడ్ని పట్టుకుని పురుషుడూ, అహంకారి, దుర్మతి అంటూ బిరుదులివ్వడం న్యాయమేనా?

ప్రేమ గ్రుడ్డిదన్నారు విజ్ఞులు.

ప్రేమించి గుడ్డివాడయ్యేది ముఖ్యంగా మగవాడే. సరిగ్గా ప్రేమ సీజనులోనే మగాడు మెడడు పోగొట్టుకుంటాడు.

లలనామణి డియర్, డాలింగ్ అనగానే... అయిసైపోతాడు. నా జీవిత చీకట్లో నువ్వొక లైటు స్థంబమంటాడు....నా బ్రతుకు జట్కా బండికి నువ్వే తారురోడ్డువంటాడు.




ఒకటా...రెండా... ఇల్లాంటి పిచ్చి మాటలు సవాలక్ష ఉపయోగించి అలుసైపోతాడు.

ఆనకి వాళ్ళకి పెళ్ళవుతుంది. అప్పుడు అసలు సిసలు కథ నడుస్తుంది.

వేరే కాపురం... వేరే కాపరమని లాంగుప్లే రికార్డు పెడుతుంది లలనామణి.

తన వాళ్ళందర్నీ వదలి వేరే కాపరం పెట్టేంత వరకు అతని ప్రాణాలు తీస్తుంది. వెళ్ళిపోతున్నావా నాయనా" అంటారు కన్నవాళ్ళు.

ఆ మాట వినిపించదు.

అన్నయ్యా మా గతేమిటని అడుగుతారు చిన్నవాళ్ళు.... ఆకాశం వేపు చూస్తాడంతే.

ఇంతలో లలనామణి కళ్ళెం పట్టుకు గుంజుతుంది...ఇంకంతే! ఆవిడ ముందు, కుక్క పిల్లలాగా అతను వెనుక. ఆ యింటి నుంచి వెళ్ళిపోతారు.

ఇల్లాంటి సంఘటనలు నిబ్బరంగా ఎదుర్కొనేందుకు గాను-ప్రేమించే రోజుల్లోనే అతనికి చక్కటి ట్రైనింగిస్తుంది అమ్మడు.

నీకోసం ప్రాణాలైనా ఇవ్వగలననే బ్రాండు పదాన్ని అతని చేత క్షణానికి అరవైసార్లు అనిపించుకుంటుంది.

ఆ విధంగా అతని సొంత ప్రాణం అఫ్టరాల్ పిడకలాంటిదనే భావం... అతని నరనరాల్లో రంగరించిపోస్తుంది. తనకోసం ప్రాణాన్నే ఇవ్వగలిగినవాడికి ఆత్మీయుల్ని దూరం చేసుకోవడం ఒక లెక్కా!

చిన్నతనంలో రామలక్షణుల్లా పెరిగిన అన్నదమ్ములు పెళ్ళయ్యాక నువ్వెంతంటే నువ్వెంతని కలబడతారు.

ఆస్థి పంపకాలంటారు.

ఎక్కువ తక్కువ లొచ్చాయని దెబ్బలాడుకుంటారు. ఒకనాడు ప్రేమగా తినిపించిన చెయ్యే ఈనాడు పీకపిసకడానికి సిద్ధమయిందంటే ఎవరు కారణం?

కట్టుకున్న భార్య. ఆ పవరు ఆవిడకే వుంది. వుంటుంది.

మగాడి అమాయకత్వం మీద స్వారీ చేసే నారీమణుల పుణ్యమాని కత్తులు నూరే ఈ మగాళ్ళు ఆడవాళ్ళ కంటే ఏ విధంగా గొప్ప




సినీతులు

పని చేసి జీతం అడగొచ్చు...
అప్పిచ్చి వడ్డీ అడగొచ్చు...
కానీ హెల్ప్‌చేసి 'థ్యాంక్స్'
అడగకూడదు.



వాళ్ళు?

అంతర్జాతీయ బాలల సంవత్సరం – మహిళల సంవత్సరం–వికలాంగుల సంవత్సరమంటూ మనం అనేక రకాల సంవత్సరాలు జరుపుకుంటున్నాం.

అంతర్జాతీయ మగాళ్ళ సంవత్సరం కూడా ఎంత చప్పున ఏర్పాటు చేసుకుంటే అంత మంచిది.

ఆ సంవత్సర సందర్భంగా పేపరు వాళ్ళు ప్రత్యేక సంచికలు ప్రచురించాలి. రేడియో వాళ్ళు బాధితుల ప్రసంగాలు ప్రసారం చేయాలి. దూరదర్శినిలో కొన్ని రూపకాలు ప్రదర్శించాలి. ఇవన్నీ అటుంచి ప్రత్యేక తపాళా బిళ్ళలు విడుదల చేయాలి.

నెత్తిన చేతులెట్టుకొని, కళ్ళలో భయం దిగులూ పెట్టుకున్న ది గ్రేట్ మగమారాజు బొమ్మ ఆ తపాలా బిళ్ళమీద అచ్చు వేయించాలి.

.....ఇదీ శివుడి వరస. లవ్ కేసుల్లో దెబ్బ తిన్నాడో ఏం పాడో గాని వాడి థియరీలతో మా ప్రాణాలు తీస్తున్నాడు వెధవ.

పోనీ – ఎదురు తిరిగి బ్రహ్మచారి బ్రతుకుని తిట్టి పోసే ప్రయత్నం చేద్దామనుకుంటే... వాడు ఎప్పుడు కనిపించినా నలగని మల్లెపువ్వల్లె మిసమిసా మెరిసిపోతుంటాడు. అంత ఆనం దంగా కనిపించే జీవివి పట్టుకుని ఏమి వుతగ్గలం!



శ్రీనివాస్ కొత్తగా ఇల్లు కట్టుకున్నాడు. దారిలో మిత్రుడు ఎదురై–"అందమైన ప్రకృతి మధ్యలో ఇల్లు కట్టుకున్నావటగా... చుట్టూ ఏ ఏ సీనరీలు కనిపిస్తాయి?"

"ఒకవైపు అద్భుతమైన కొండలు... రెండవ వైపు అందమైన పచ్చని పొలాలు... మూడవ వైపు ముచ్చటైన చెరువు..."

"మరి నాల్గవ వైపు?!"

"ఇరవై లక్షల అప్పు!"

–కె.వి.భవాని, యర్రబాలెం

ఎప్పుడు తిట్లు తిన్నా మేమే!

శివుడిలో మరో ప్రత్యేకత ఉంది. మేము సుఖంగా ఉన్న సందర్భాలలో పేపర్లో ప్రకటించినా కనిపించడు. అట్లాంటిది – ఎట్లా కనుక్కుంటాడో ఏమో ఇంట్లో పోట్లాడి పార్కులో కాలక్షేపం చేస్తున్నప్పుడో... అలిగి రైలెక్కినప్పుడో తక్కున ప్రత్యక్షమవుతాడు. పారిపోదామనుకున్నా విడిచిపెట్టడు.

దిగులు ఫోజు తుడిచేసుకొని... పొడినవ్వు నవ్వినా పట్టేస్తాడు.

కళ్ళలోకి సూటిగా చూస్తూ అడుగుతాడు. 'బావున్నావా ఫ్రండూ?' అని. ఏం సమాధానం చెబుతాం? మహా అయితే వెకిలినవ్వొకటి విసురుతాం. అక్కడ్నించి ప్రారంభమవుతుంది. హింస – వాడి వాగ్ధాటీరూపంలో!

'అయ్ నో మై బాయ్! ఇంట్లో పోట్లాడి వీధిన పడ్డ మనిషివి నువ్వు. నీ తప్పేం లేదని నాకు బాగా తెలుసు. వద్దురా– పెళ్ళొద్దని శతపోరినా నా మాట వినకుండా చేసుకున్నావ్.... అనుభవించు. ఒక రహస్యం చెబుతా విను. మగాడ్ని సర్వనాశనం చేసే ఆయుధం పేరు ఆడది. ఆడదంటే ఆడించేదని ఇంకో అర్థం కూడా ఉంది. మగాడ్తో ఆడుకుంటూ – వాడిని వెధవని చేసేవరకూ నారీరత్నం సొత్తు.

క్షణంలో ఏడుస్తుంది... మరుక్షణంలో నవ్వుతుంది... ఏడ్చినవ్వి మగాడి మనసుతో చెడుగుడు ఆడుతుంది.

ఒక పోలిక చెప్తాను రిసీవ్ చేసుకో. మగాడు ఆరిటాకులాంటివాడు. ఆడది ముల్లులాంటిది. అరిటాకుమీద ముల్లు పడినా, ముల్లు మీద అరిటాకు పడినా ఆన్యాయం జరిగేది అరిటాకుకే... అంటే మగాళ్ళకే!

ఈ పోలిక అన్నప్పుడు మనకు దవుటు కల గొచ్చు. ఆడది అరిటాకు మగాడు ముల్లనీ శాస్త్రాలు ఘోషిస్తుంటే శివుడు దాన్ని రివర్స్ చేసి చెబుతాడేమిటని ఆందోళన పడకుండగా ఆలోచించడానికి ఛాన్స్ ఇవ్వకుండా మరో బాణం వెంటనే ప్రయోగిస్తాడు.

"వెనుక జన్మలో మనం కొన్ని వెధవ్వేషాలు వేసే వుంటాం. అందుకు శిక్షగా ఈ జన్మలో ఒక ఆడది ఎక్కడో ఒక మామగారింటా మన కోసమే పుట్టి పెరుగుతూ ఉంటుంది. ఆ మాట కొస్తే మావ అనగా నెవడు? కిందటి జన్మలో వాడు నీకు విలనుడు. ఆ జన్మలో నిన్నేం చేయలేక ఈ జన్మలో నీకు మామగా అవతారమెత్తాడు. నీ కోసం ఒక డాటర్ని కన్నాడు. ఆ పిల్లని నీకు అంటగట్టి నిన్ను దెబ్బ తీస్తాడు. అందుకు నాందీ వాచకంగా శుభలేఖలు అచ్చవుతాయి.

శుభలేఖంటే వారంటని అర్థం. ఆజన్మ కారాగార వాసానికి ఇన్విటేషనన్న మాట...

పెళ్ళవుతుంది. పెళ్ళిని పెద్ద బురదగుంటతో పోల్చవచ్చు. అదొక ఊబి. కాలు పెడితే మనిషి మొత్తం కూరుకుపోతాడు... అడ్రస్సుండదు.



పెళ్ళంటే ఒక జైలని కూడా చెప్పుకోవచ్చు. పిల్లలు పుడతారు. వాళ్ళు పోలీసులు. రక్షక భటులన్నమాట. చిరునవ్వుల్తో ముద్దు ముద్దు మాటల్తో నీ కాళ్ళు చేతులకీ సంకెళ్ళు వేస్తారు. ఫినిష్! ఏతావతా పెళ్ళి పీటలమీద మూడు ముళ్ళూ వేసేంత వరకే నువ్వు గొప్ప... పవర్ ఫుల్ మనిషివి... హీరోవి! ఆ తర్వాత రోజుకో ముడివేసి నీ ప్రాణం తీసే ఛాన్స్ నీ భార్య తీసుకుంటుంది. ఈ సూత్రాన్ని కాదనే మగాడ్ని చూపించు. వాడిమెళ్ళో దండవేసి అడవి కెళ్ళి తపస్సు చేసుకుంటాను" అని ఛాలెంజ్ చేస్తాడు.

ఇంటి గొడవతో సగం చచ్చి బతుకుతుంటే ఇప్పుడీ మాటల్తో పూర్తిగా చచ్చిపోవడం ఖాయం. ఇలాంటి పరిస్థితుల్లో శివుడు అడవికి వెళ్ళిపోవడానికి ఉత్తమ పురుషుడెవరైనా వచ్చి శివుడి ఛాలెంజ్‌ని ట్పుట్పుట్పు చేసేస్తే ఎంచక్కా వాడు తపస్సుకెళ్ళిపోతాడు. ఆనక పురుష లోకం శివుడు బాణాల బారినుంచి రక్షింప బడుతుంది! అయితే...

ఎక్కడున్నాడు శివుడి సవాలుకి సమాధానం చెప్పే ఉత్తమ పురుషుడు?

సాక్షాత్తు దేవుడ్నే దిగి రమ్మందామనుకుంటే అందరూ అందరే. భార్యా విధేయులు. ఏ దేవుడి పేరు చూసినా భార్య పేరు తర్వాతే సొంత పేరు ఉంటుంది మరి!

సీతారాములు, పార్వతీ పరమేశ్వరులు, లక్ష్మీ నారాయణులు, రాధాకృష్ణులు... వీళ్ళవరికి ఇల్లాలి పేర్లు తప్ప ఇంటిపేర్లు లేవు. ఎవర్నని పిలుస్తాం. అంతా భార్య చాటు భర్తలే గదా!

వాళ్ళ సొంత గొడవల్తోనే సతమతమైపోతూ ఉంటే మనల్ని ఆదుకోవడానికి అవకాశమెక్కడిది? అల్లాంటిది...

నిన్నగాక మొన్న ఒక గొప్ప శుభవార్త విన్నాను. అంత వార్త విని నన్ను నేను అదుపులో పెట్టుకోలేక పోయానంటే నమ్మాలి మీరు.

శివుడు కూడా ఒక ఇంటివాడయ్యాడు.

ఆ మహాతల్లి ఎవరోగాని చేతులెత్తి మొక్కాల్సిందే. పురుషపుంగవులం మేము ఇంతమంది మి వుండి కూడా వాడి ఆగడాన్ని ఆపలేక పోయాం.

ఏమి ట్రిక్కు ప్రయోగించిందో, ఎన్ని రకాల డైలాగులు చెప్పిందో గాని మొత్తానికి శివుడ్ని ముగ్గులోకి దించేసి పుణ్యం కట్టుకుంది.

అందుకే అంటాను.

**'ఆడవాళ్ళూ మీకు త్రీచీర్స్'** అని!

తా.క - శివుడెట్లా పడిపోయాడో ఆ వివరాలు అతని ద్వారానే తెలుసుకుందామనే తొందర్లో రైలెక్కుతున్నాను.

ఇప్పుడు నన్ను పట్టుకుని 'ముగింపు' హర్రీ బర్రీగా గీకేవేమిటని ప్రేకులేయడం భావ్యం కాదు.... సెలవ్!

## సినీతులు

నిజం చెప్పకపోవటం అబద్ధం...
అబద్ధాన్ని నిజం చేయాలనుకోవటం మోసం.



గంగాధర్ వడ్లమన్నాటి

# ఫన్ పంచ్!

మొగుడ్స్... పెళ్ళామ్స్... మధ్యలో నవ్వుల్స్!



## 'భర్త' డే రింగ్

"ఏటమ్మగారూ...! ఎంత మీ పుట్టిన రోజు అయితే మాత్రం పొద్దున గుడికెళ్ళి ఇంత ఆలస్యంగానా రావటం అడిగింది పనిపిల్ల రమణి ఆశ్చర్యంగా తన బుగ్గలు నొక్కులు పడేలా నొక్కేసుకుంటూ.

"ఏం చేయనూ!... అభిషేకం లేటయింది. పైగా నా ఫ్రెండ్స్ సర్‌ప్రైజ్ అని నా పేరున అన్నదానాలు, వస్త్రదానాలు అదీ నా చేతుల పైనే చేయించారు." చెప్పింది లలిత ఉబ్బి తబ్బి బ్బై పోయి మబ్బుల్లో తేలిపోతూ.

"అలాగా! మీ ఫ్రెండ్సు అంతా కలిసే ఇంత చేశారంటే ఇక మన అయ్యగారు మీకేం బర్త్‌డే గిఫ్టు ఇస్తారో సూడాలమ్మగోరూ" చెప్పిందామె పళ్ళన్నీ బయటపెట్టి మరీ ఇకిలిస్తూ.

అప్పుడే అటుగా వచ్చి ఆ మాటలు విన్న మధు, 'వార్నాయనోయ్! అసలు ఇవాళ నా శ్రీమతి పుట్టిన రోజనే సంగతే మరచిపోయానే. పోయిన సంవత్సరం ఏ బహుమతీ ఇవ్వలేద ని నా ముక్కు పగలకొట్టింది.' అని తనలో తనే అనుకుని గజ గజ వణుకుతున్న అతన్ని చూసిన లలిత–"ఏవండీ" అనగానే ఓ క్షణంలో తేరుకుని ఓ వెర్రి నవ్వు ముఖానికి అద్దేసి– "హ్యా...హ్యాపీ బర్త్‌డే" షేక్ హ్యాండ్ ఇచ్చాడు చిరు వణుకు స్వరంతో.

"ఏంటీ! ఇవాళ కూడ ఉత్త చెయ్యేనా?... ఛీఛీ!! మీరు మారరండీ..." అని ఆమె మరేదో అనేంతలో "ఆగు! ఇంకేం మాట్లాడకు. నాపై అనవసరంగా చెయ్యెత్తకు. అసలు నిన్నే ఆ గిఫ్ట్ కొనేసినా నిన్ను సర్‌ప్రైజ్ చేయాలనే ఇప్పటిదాకా ఆగాను." చెప్పాడు మధు.

"ఔనా! ఏంటండీ అది!" అడిగిందామె మురిసిపోతూ మూడు వంకర్లు తిరిగిపోతూ.

"అది చెప్తే కాదు... చూపితేనే తెలుస్తుంది. ముందు నువ్వు కళ్ళు మూసుకో." చెప్పాడు నవ్వుతూ.

ఆ మాటలకామె పొంగిపోయి మూతిని లక్కపిడతలా చేసి, సరే అని కళ్ళు మూసు కుంది. వెంటనే మధు కుక్క తరిమిన మనిషిలా తన బెడ్‌రూంలోకి వచ్చి, 'అసలే దాని కోపా నికి జడిసి గిఫ్ట్ నిన్ననే కొనేశానని వాగేశాను. ఇప్పుడు ఏం చేయాల్రా దేవుడా?' అని ఆలోచి స్తున్న వాడల్లా ఏదో ఆలోచన వచ్చినట్టుగా బీరువా తీసి కలియజూశాడు.



బంగారు ఉంగరం పెట్టుకొనే చిన్ని ఖాళీ బాక్స్ కన్పించింది. అది అతని ప్రమోషన్ నాడు వాళ్ళ ఆఫీస్ స్టాఫ్ ప్రెజెంట్ చేసిన బంగారు ఉంగరం తాలూకు ఖాళీ బాక్స్ అది.

వెంటనే దాన్ని తీసి దొరికిన ఓ రంగు కాగితం చుట్టి పరుగున వచ్చి లలిత చేతిలో పెట్టి, "చూడు లలితా! నీ కోసం నేనేం తెచ్చానో బ్యూటీఫుల్ రింగ్!" చెప్పాడు తడబాటు కష్టపడి దాచేస్తూ.

"ఏంటండీ ఇది?" అని ఆమె ఓపెన్ చేసేం తలో "వద్దు బాబోయ్" అని అరిచి దాన్ని ఆమె చేతిలోంచి లాగేసి, టి.వి.పై పెట్టి –

"అదే లలితా ఇప్పుడు వద్దు. నేనాల్రెడీ ఫోన్ చేసి కేక్ ఆర్డర్ చేసాను. అది తెస్తాను. దాన్ని కట్ చేసి, తర్వాత ఈ గిఫ్ట్ ఓపెన్ చేద్దువు గాని... సరేనా!?" అంటూ కంగారుగా కాప లించుకున్నాడు.

ఆ దృశ్యం చూసిన పనమ్మాయి రమణి–

"అమ్మగారూ నేను చెప్పానా?! అది డయ మండు రింగే" చెప్పిందామె నమ్మకంగా.

ఆ మాటలు విన్న మధు, 'అయిపోయాను. నేను ఏదో చిన్న గోల్డ్ రింగ్ కొందామనుకుంటే ఇప్పుడు డైమండ్ రింగా!' అని మనసులో అనుకుని "లలితా నే వెళ్ళి కేక్ పట్టుకొస్తానూ" అని హడావుడిగా వెళ్ళి ఓ చిన్న డైమండ్ రింగ్ కొని తెచ్చి ఏ అనుమానం రాకూడదని దాన్ని మళ్ళీ అదే పాత బాక్సులో పెట్టి అదే రంగు కాగితం చుట్టి హమ్మయ్య అనుకుని–

"లలితా రా!... ఇదిగో కేక్. త్వరగా కట్ చెయ్" అంటూ ఆమె చేతికి కేక్ తెచ్చిన బ్యాగ్‌ని అందించాడు.

ఆమె ఆ బ్యాగ్ తీసుకొని ఓపెన్ చేసి, కేక్‌ని చూస్తూ "వావ్! చాలా బావుంది. ఎంతండీ?" అడిగిందామె ఆసక్తిగా.

"రెండు వేలు." చెప్పాడు గర్వంగా.

"అబద్దాలు చెప్పకండి! అంత ఉంటుందా దీని ఖరీదు?జజ

"నమ్మకపోతే బిల్లు చూడవోయ్!..." అని విసురుగా జేబులోంచి బిల్లుతీసి ఆమె చేతి కిచ్చాడు.

ఆ బిల్లు చూస్తూనే ఆమె కోపంగా మధు నెత్తిన ఓ మొట్టికాయ వేసి, "అంటే ఈ సంవ త్సరం కూడా మీకు నా పుట్టినరోజు గుర్తు లేదన్నమాట" అడిగింది కారంగా చూస్తూ.

"అంతా కరెక్ట్‌గానే చేశానే. మరి నీకెలా తెల్సింది?" అడిగాడు బిక్కమొహంతో.

"ఎలాగా! మీరిప్పుడూ నాకిచ్చింది కేక్ కొన్న బిల్లుకాదు. ఇందాక మీరు కొన్న డైమండ్ రింగ్ తాలూకు బిల్లు" అని చెప్తూనే మరోటి మొట్ట దంతో తెల్లమొహం వేశాడు మధు.



కథ

# తగ్గేదుందా?

కోనె నాగ వెంకట అంజనేయులు
9290660220

(కూరల బండి దగ్గర....)

"బెండకాయలెలా యిస్తున్నావ్?"

"కె.జి. నలభై రూపాయలు బాబూ!"

"అబ్బో! చాలా ఎక్కువే! తగ్గించవా!... సరే! వంకాయలెలా యిచ్చేవ్?"

"కె.జి. ముప్ఫై రూపాయలు బాబూ."

"ఓరి నాయనోయ్! తగ్గవా? ఆ కాకరకాయలెలా?"

"కె.జి. అరవై బాబూ."

"దేవుడోయ్! అంత రేటే? మరి బీరకాయలెలా యిచ్చావ్?"

"కె.జి. ముప్ఫై అయిదు చేసుకోండి."

"అంత రేటా? తగ్గేదుందా? మరి కేరెట్?"

"కె.జి. నలభై రూపాయలే బాబూ."

"ఏమిటీ రేట్లు? తగ్గించవా?... యింతకీ టమాటా లెలా?"

"కె.జి. యాభై బాబయ్యా."

"బంగారమే చవగ్గా వుంది చూస్తుంటే! తగ్గేదేమైనా వుందా?"

"మీరు యిందాకటినుంచీ తగ్గేదుందా? తగ్గించవా? అని అడుగుతున్నారు కాబట్టే కాస్త తగ్గిస్తానులెండి."

"అదీ! అలా రా దారికి. చెప్పు, ఏం తగ్గిస్తావో?"

"తూకం!"

"ఆccc?!!!"










## సినీతులు

ఆశ క్యాన్సర్ ఉన్న వాడిని
కూడా బతికిస్తుంది...
భయం అల్సర్ ఉన్నవాడిని
సైతం చంపేస్తుంది.



# క్రైమ్ ఫన్!

## డిశంబర్ విజేతలు

ఈ శీర్షికలో పాల్గొన్న కార్టూనిస్ట్ అందరికీ అభినందనలు! ఇది ఎవరి లెవల్ ఎంతో నిరూపించుకునేందుకు ప్రవేశపెట్టిన శీర్షిక మాత్రం కాదు! మన తెలుగు కార్టూనిస్టులు 'క్యాప్షన్‌లెస్ కార్టూన్ల'లో అగ్రగాములవ్వాలనే సదుద్దేశంతో మొదలయినదీ వేదిక! మరిన్ని మంచి మంచి కార్టూన్లు వేయడానికి ఈ 'క్రైమ్‌ఫన్' స్ఫూర్తినివ్వాలని మా ఆకాంక్ష! -ఎడిటర్

శ్రీసత్యనారాయణగారి సౌజన్యంతో



మొదటి బహుమతి రూ.500/-లు పొందిన కార్టూన్




రెండవ బహుమతి రూ.300/-లు పొందిన కార్టూన్




మూడవ బహుమతి రూ.200/-లు పొందిన కార్టూన్

కన్సోలేషన్ బహుమతులు @ రూ.100/-












ార్టూన్




.200/-లు పొందిన కార్టూన్

## కన్సోలేషన్ బహుమతులు @ రూ.100/-











సీరియల్



**జరిగిన కథ:** చిన్నప్పుడు సుబ్బారావుతో ఒకజంట ఫోటో చూస్తుంది శ్రీవల్లి. వాళ్ళెవరో ఇంట్లో వాళ్ళకెవరికీ తెలియదంటారు. ఎవరికీ తెలియని ఆ ఫోటోలోని వ్యక్తుల గురించి తెలుసుకోవడానికి సుబ్బారావు బంధువులందరినీ కలవాలనుకుంటుంది శ్రీవల్లి.

ఆ భాగంలో సుబ్బారావు పెద్దక్కయ, అన్నయ్య వాళ్ళింటికి వెళతారు. **-ఇక చదవండి**

**"ఈ వూళ్ళో చూడదగినవేమున్నాయి వదినా?" అడిగాడు సుబ్బారావు. వచ్చి కొన్ని గంటలు కాకముందే సుబ్బారావుకు బోర్ కొడుతోంది.**

**అన్నయ్యతో మాట్లాడదామని గదిలోకెళితే టేబుల్ మీద ఆఫీసునించి తెచ్చుకున్న హోం వర్కు ఫైళ్ళు ముందేసుకుని దీక్షగా రాసుకుంటూ బాటసారి సినిమాలో నాగేశ్వరరావులా కనిపించటమే కాకుండా తన ప్రశ్నలకు కూడా ఆ... ఊ... లతో మాత్రమే జవాబిచ్చాడు.**

**గదినుండి లేచి వస్తుంటే "ఆ అమ్మాయినేనా నీవు ప్రేమించింది?" అంటూ అడిగాడు వ్యాస్.**

హమ్మయ్య పైకి మాట్లాడకపోయినా అన్నీ గమనిస్తూన్నాడన్నమాట.

"అవునన్నయ్యా" సంతోషంగా అన్నాడు సుబ్బారావు.

"ఈ ప్రేమలు... సింగినాదం జీలకర్ర వట్టి బూటకం. చాలా జాగ్రత్తగా వుండాలి. అమ్మాయి చాలా తెలివైనదానిలా కనిపిస్తోంది... జాగ్రత్త" అన్నాడు వ్యాస్.

కామెర్ల రోగికి లోకమంతా పచ్చగా కనిపిస్తుందంటే ఇదే కాబోలు అనుకుని-

"అబ్బే! ఆ అమ్మాయి చాలా మంచిదన్నయ్యా" అన్నాడు.

"మంచిదయితే ఫర్వాలేదు. ఈ కాలపు ఆడపిల్లలు కాలక్షేపానికి ప్రేమించామంటూ తిరిగాక నెక్ ఆఫ్ ది మూమెంట్‌లో చేతులెత్తేసి ఇంకో పెళ్ళి చేసుకుంటారు. అమ్మాయి మంచిదని ముందుగానే కితాబిలిచ్చెయ్యకు. ముందుంది ముసళ్ళ పండగ. సరే, నాకెందుకు ఎవరి ఖర్మకెవరు బాధ్యులు. వెళ్ళి పడుకో" అంటూ సుబ్బారావు గది దాటకముందే లైటార్పేశాడు. స్థాణువైపోయాడు సుబ్బారావు.

చీకట్లో తడుముకుని గోడకు ముక్కు గుద్దించుకుని గడప తగిలి బోర్లపడి లేచి వస్తుంటే శ్రీవల్లి చూసి పకపక నవ్వింది.

ఆ మరుసటి రోజు ఉదయం తొమ్మిదింటికంతా స్నానం టిఫిన్ ముగించుకుని క్యారియర్‌తో ఆఫీసుకెళ్ళిపోయాడు వ్యాస్.

కదుపు కదల్లేదంటూ రెండుసార్లు కాఫీ తాగి ఇంటిముందున్న తోటలో పచార్లు చేస్తున్నాడు సుబ్బారావు.

బద్ధకంగా వరండాలో వున్న ఈజీచైర్లో కాళ్ళారజాపుకుని పడుకుంది శ్రీవల్లి.

"అమ్మాయ్ నిమ్మీ! నిమ్మీ!" అంటూ అరుస్తున్న గొంతు విని ఉలిక్కిపడ్డారు సుబ్బారావు, శ్రీవల్లి.

డెబ్భై ఏళ్ళ ముసలావిడ తెల్లటిచీర గోచీ పోసి కట్టుకుని బోడిగుండు మీదికి చీర కప్పుకుని సర్దుకుంటూ హడావిడిగా వస్తోంది.

ఈ కాలంలో కూడా ఇలాంటి బోడిగుండు బామ్మలున్నారా?... అని ఆశ్చర్యమేసింది శ్రీవల్లికి.

"ఏరా అబ్బాయ్!... నువ్వేనా దుర్వాసుడి తమ్ముడివి? నీ పేరు సుబ్బుడు గదూ" అంది ముక్కుమీదికి జారుతున్న కళ్ళద్దాలను పైకి సర్దుకుని చూస్తూ.

"దుర్వాసుడా! ఆయనెవరు?" సుబ్బారావుకు కోపమొచ్చింది ఆ ముసలావిడ అలా సుబ్బుడు అని పిలుస్తుంటే వళ్ళు మండిపోతోంది.

"ఇంకెవరు డి.వ్యాస్. నేను దుర్వాసుడని

పేరు పెట్టానులే" బోసినోరు వెళ్ళబెట్టి అంది నవ్వుతూ బామ్మ.

"ఇంతకీ తమరెవరు? ఈ ఇంటి ఓనరు గారా?"

"అబ్బే... కాదు సుబ్బారావ్! ఈవిడెవరు కున్నావూ మా నాన్నకు వేలు విడిచిన మేనత్త కూతురి మామయ్య చెల్లెలు ఆడబడుచు నాకు వరుసకు అమ్మమ్మ అవుతుంది. ఈవిడకు పిల్లల్లేరు. భర్త ఆ ప్రక్కవీధిలో వుంటున్నారు. ఈవిడ మనింటికి నాలుగిళ్ళవతల ఓ చిన్న గదిలో వుంటుంది. అందరికీ వంటలు చేయ టం, పచ్చళ్ళు అప్పడాలు, వడియాలు, విస్తర్లు చేసిపెట్టి తన పొట్ట పోషించుకుంటోంది. చాలా మంచిది. నాకు చాలా సహాయంగా వుంటుంది. మీ గురించి చెప్పాను. మీరొస్తు న్నారని కూడా చెప్పాను. అందుకే కలుపు గోలుగా అడిగేసింది. ఏమీ అనుకోకయ్యా" అంది నిర్మల సుబ్బారావుతో.

"అయ్యో! అలాంటిదేం లేదొదినా! పక్కింటా విడో, ఎదురింటావిడో అనుకున్నానంతే" ఇబ్బందిగా కదులుతూ అన్నాడు సుబ్బారావు.

"అదేమిటక్కయ్యా! బామ్మగారి భర్త పక్క వీధిలో వున్నారన్నారు. మరి ఈవిడేమో తెల్ల చీర...?" అంటూ ఆగిపోయింది శ్రీవల్లి.

"అదో పెద్ద స్టోరీ. చెబుతూ వెళితే ఇరవైఏళ్ళ గ్రంథమవుతుంది. టూకీగా చెబుతాను. బామ్మ గారు ఆ రోజుల్లోనే పెద్దలను ధిక్కరించి ప్రేమ వివాహం చేసుకున్నారు. దాదాపు పదేళ్ళు అన్యోన్యంగా కాపురం చేశారు. బామ్మగారికి పిల్లలు కలుగలేదని మరో వివాహం చేసు కుంటానన్నారు. బామ్మగారు ఒప్పుకోలేదు. అంటే ఆయన మరో స్త్రీతో అక్రమసంబంధం పెట్టుకుని బామ్మను నిర్లక్ష్యం చేశారు. బామ్మ బాగా పోట్లాడింది. పంచాయితీలు పెట్టిం చింది. ససేమిరా వినలేదు. నువ్వా ఓ మూల పడుండు, ఇంత కూడేస్తాను అన్నారట. బంధు జనమంతా మగాడన్నాక పెళ్ళాంతోనే స్వచ్ఛం దంగా కాపురం చేయాలని లేదు, ఇతర స్త్రీలతో సంబంధమున్నా చూసీ చూడనట్లుండాలి. సర్దుకుపోయి కాపురం చేసుకోవాలి అన్నారట.

బామ్మ భర్తగారు అందరూ తనకు సపోర్టు రావటం భార్యను చూసి మీసం మెలేశారట.

సినీతులు

యుద్ధంలో గెలవటమంటే
శత్రువుని చంపటం కాదు...
శత్రువుని ఓడించడం.



దాంతో బామ్మగారు కక్ష సాధింపు చర్యగా గుండు గీయించుకుని తెల్లచీరతో విధవ రాలిగా తయారయి, భర్తకు పిండం పెట్టి తర్పణం వదిలిందట.

ఊళ్ళోవాళ్ళందరూ ముక్కుమీద వేలేసుకుని వారించబోయినా వినలేదట. వేదమంత్రాల మధ్య చివరి వరకూ తోడుంటానని ప్రమాణం చేసి ఇప్పుడిలా ప్రవర్తించేవాడు చచ్చినవాడితో సమానం అంటూ చెప్పి నా జీవితం, ఇది నా శరీరం నా ఇష్టమొచ్చిన వేషధారణతో వుంటాను. నన్ను కంట్రోల్ పెట్టడానికి ఎవరికి హక్కు లేదు. అంటూ అందరి నోర్లూ మూయించి, ఇలా చిన్న చితకా పనులు చేసుకుంటూ బ్రతుకుతోంది" అంటూ ముగించింది నిర్మల.




"రేపు తెల్లవారుఝామున ఫస్టు బస్సుంది. వెళ్ళిపోదాం" అన్నాడు సుబ్బారావు శ్రీవల్లితో.

"వెడదాం! తొందరేముంది. మనం వచ్చిన పని కాస్తా మరిచిపోయి ఆతిథ్యం స్వీకరించి వెళితే సరిపోతుందా?" అంది శ్రీవల్లి.

"ఓ! అదొకటుంది కదూ! అదేదో ఈ రాత్రికే తేల్చుకో" మొహం ధుమధుమలాడుతూ అక్కడి నుంచి వెళ్ళిపోయాడు సుబ్బారావు.

ఆ రాత్రి చాలాసేపు నిద్రపట్టక అటూ ఇటూ దొర్లి విసుగుపుట్టి వసారాలో కొద్దామని లేచి వస్తుండగా నిర్మల భర్త గదిలో కాకుండా మరో గదిలోకెళ్ళి పడుకోవటం గమనించింది.

"పెళ్ళికూడా కాలేదు. చాలా అసాధ్యురాలిలా వుంది అనుకోకండి. ఇలా అడుగుతున్నాననీ అనుకోకండి. మీరు బావగారి గదిలో నిద్రపోకుండా..." అంది వల్లి కాస్త సిగ్గు నటిస్తూ సంశయంగా.

"అమ్మో! గట్టిదానివే! ఒక్కరోజుకే కనిపెట్టేశావే!... మేము భార్యాభర్తలమే కానీ గదిలో మాత్రం కాదు!"

అదిరిపడింది శ్రీవల్లి.

"అదంతే! నేను పెళ్ళికాకముందు ఓ బడుద్ధాయిని ప్రేమించాను. కబుర్లు చెప్పి కడుపు చేశాడు. ఇంట్లో వాళ్ళకు తెలిసింది. మాదసలే పల్లెటూరు. అబార్షన్ అదీ ఇదీ అన్నారంటే ఎలాగైనా తెలిసిపోతుంది. అందుకని గప్‌చిప్‌గా నెలతిరక్కముందే ఆయనతో పెళ్ళి జరిపించారు. పెళ్ళినాటికి మూడునెలల గర్భవతిని. అబద్ధపు మాటలతో, మోసంగా ఆయనతో కాపురం చేయటం చేతకాలేదు. మొదటి రోజునే విషయమంతా చెప్పాను. అందుకాయన అదిరిపడి నన్ను ఈడ్చి తన్ని బయటకు గెంటేస్తారనుకున్నాను.

"అలాగా!" అంటూ నిర్లిప్తంగా ఓ నవ్వు నవ్వారు.

పెద్దవాళ్ళ బలవంతంతో ఇష్టం లేకున్నా నన్ను పెళ్ళి చేసుకున్నట్టున్నావు. సినిమాల్లో హీరోలా లవర్‌ని తెచ్చి మళ్ళీ నీకు పెళ్ళి చేయటం నేను మిగిలిపోవటం లాంటివి నా వల్ల కాదు. వెళ్ళాలనుకుంటే గప్‌చిప్‌గా ఈ రాత్రికే అతని దగ్గరికెళ్ళిపో. నాకే అభ్యంతరం లేదు" అన్నారు.

"వెళ్ళటానికి చోటు లేదు. నా లవర్ నన్ను మోసం చేసి పారిపోయాడు. నేను మీ తోనే బ్రతుకును పంచుకుందామనుకుంటున్నా. నేను అబార్షన్ చేయించుకుంటాను. మనం క్రొత్త జీవితం ప్రారంభిద్దాం" అన్నాను.

"మనం అంటున్నావు. నా సంగతి తెలుసా నీకు?"

"తెలుసు! మీరు భగ్నప్రేమికులని విన్నాను. ఇంచుమించు ఇద్దరం దగా పడినవాళ్ళమే. అలా అని వీధినపడకుండా బ్రతుకు పంచు



## ప్రియమిత్రునికి అశ్రునివాళి



హాస్యానందం ప్రారంభ సంచిక నుండి అత్యంత ఆప్తునిగా ఉంటూ మాకు హార్దికంగా ఎంతో చేయూతనిచ్చిన **నా మిత్రులు శ్రీ చంద్రం** ఇక లేరు అంటే నమ్మశక్యంగా లేదు. హాస్యానందంలో 'విష్ణుశర్మ ఇంగ్లీష్ చదువు' సీరియల్‌కు బొమ్మలు వేస్తూనే... కొన్ని కథలకు కూడా తన అందమైన బొమ్మలతో నిండుతనం చేకూర్చేవారు. ఎప్పుడు కలిసినా ఆత్మీయంగా పలకరించే ఆ ఆత్మీయుడు ఇక పలకరించడు అనే భావనే గుండెల్ని పిండేస్తోంది. ఆయన ఆత్మకు శాంతి కలగాలని, ఆయన సతీమణి శారద (హాస్యానందంలో 'లబోదిబోలు' శీర్షిక రెండు సంవత్సరాలు నిర్వహించారు) గారికి గుండెనిబ్బరాన్ని కలుగజేయాలని ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను. **-రాము.**



కుని... గడుపుదామని కోరుకుంటున్నాను" అన్నాను.

"అందరి ఆడపిల్లల్లా దగా పడగానే జీవితం ముగించాలన్న పిరికి ఆలోచనలు చేయకుండా ధైర్యంగా బ్రతకాలనుకుంటున్నావు. నిన్ను నేను అభినందిస్తున్నాను. నా మనసిప్పుడు గాయపడి వుంది. రోజులు గడిస్తే మళ్ళీ మామూలుగా మారగలనేమో... ప్రస్తుతం మాత్రం మనం స్నేహితులం మాత్రమే..." అంటూ గుడ్ నైట్ చెప్పారు.

ఆ తర్వాత ఆయన ఎప్పుడూ ముభావంగా వుండేవారు.

పాప పుట్టింతర్వాతయినా నాకు దగ్గరవుతారనుకున్నాను. పాపతో ఎంతో ప్రేమగా వుంటారు. ఇంట్లో బాధ్యతలన్నీ నాకే అప్పచెప్పారు. ఎప్పటికైనా మేం భార్యాభర్తలం కాకపోతామా అనుకుంటున్న సమయంలో ఆయనకు యాక్సిడెంటయింది. వెన్నెముక దెబ్బతినింది. సంసారసుఖం కూడదన్నారు డాక్టర్లు.

అంతే! లైఫ్ ఊరికే ఇలా కంటిన్యూ అయిపోతోంది. చాలాసార్లు మరెవరినైనా చూసి పెళ్ళి చేసుకుని వెళ్ళు అన్నారు. నేను బాగా కోప్పడ్డాను. ఇంకోసారి పెళ్ళి ప్రసక్తి తెస్తే ఆత్మహత్య చేసుకుంటానన్నాను.

నిశ్శబ్దంగా వుండి పోయారు. ఇద్దరం పాపను చూసుకుంటూ, పాపకోసం బ్రతుకుతున్నాము" అంది నిర్మల.

ఆశ్చర్యంగా అలాగే వుండిపోయింది శ్రీవల్లి.



"మా పెళ్ళిలో పెదుదురుగాని బట్టలు... ఇప్పుడీ మర్యాదలెందుకు?" అంది వల్లి తనకు, సుబ్బారావుకు కొత్తబట్టలిస్తూ కుంకుమ పెడుతున్న నిర్మలతో మొహమాటంగా.

"అప్పటి ప్రెజెంటేషన్ వేరే వుంది. ఇప్పుడివి తీసుకోండి."

"ముహూర్తాలు త్వరగానే నిర్ణయిస్తున్నారా ఇంకా లేటా?"

"ఇప్పుడేదో మౌఢ్యం వుందిట వదినా... ఇంకో నెలకు అయిపోతుందట" అన్నాడు సుబ్బారావు మెల్లిగా.

"అలాగా! మరీ ఇలా అమ్మాయిని వెంటేసుకుని తిరుగుతున్నావేంట్రా! ఎంత కాబోయే మొగుడూ పెళ్ళాలయినా మరీ ఇంత స్వేచ్ఛ పనికిరాదు. సరి సరి, అమ్మాయిని జాగ్రత్తగా తీసికెళ్ళు నేను ఆఫీసుకెళుతున్నాను" అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు వ్యాస్.

(సశేషం)









**"ఏంటి! సిన్మా తీస్తావా?... అదేం పోయేకాలం?" నోటిలో సిగరెట్ కాలుతుండగానే ఎగతాళిగా అడిగాడు సినీ నిర్మాతల సంఘం అధ్యక్షుడు భానీ ప్రకాష్.**

**"అవునండీ ... పూరీ జగన్నాథ్ దర్శకత్వంలో ఓ సిన్మా చేయాలని నా కోరిక. అందుకే అమలాపురం నుండి డైరెక్ట్‌గా భాగ్యనగరంకి వచ్చేశా..." సమాధాన మిచ్చాడు సుబ్బారావు.**

**"ఎంత డబ్బు ఖర్చు పెడతావేంటి?" అడిగాడు భానుప్రకాష్.**

**"కోటి రూపాయల దాకా ఖర్చు పెడదామండీ ..."**

"కోటి రూపాయలా?... పూరీ జగన్నాథ్ కాదు కదా... ఇడ్లీ విశ్వనాథ్ కూడా దొరకడు. ఆ బడ్జెట్‌కి..." మరోసారి వెటకారంగా నవ్వేడు.

"ఇడ్లీ విశ్వనాథా!!... ఆయనెవరండీ బాబూ?"

"ఎవరో ఒకర్లే... రైమింగ్‌కి వాడానంతే... కావాలంటే మనం పెట్టుకొనే క్రొత్త డైరక్టర్‌కి ఆ పేరు వాడుకుందాంలే. ఇప్పుడేం చేద్దామో చెప్పు!"

"అంతేనా! అయితే రామ్‌గోపాల్‌వర్మ దర్శకత్వంలో రాత్రో, పగలో, శివో, కవో ... ఏదొక లోబడ్జెట్ హర్రర్ మూవీ చేసేద్దామంటారా?" అడిగాడు సుబ్బారావు.

"ఛస్!... నీకేం అర్థం కాదా ... ఆ డబ్బుకి రామ్‌గోపాల్ వర్మ కాదు కదా... కామ గోపాల్ వర్మ కూడా చేయడు... ఇంకేమైనా ప్రపోజల్ ఉంటే చెప్పు."

"కామగోపాల్ వర్మా!... ఆయనెవరండీ?... ఇదీ రైమింగ్ కోసమే వాడారా?... నిజంగా ఉన్నారండీ? ఎందుకంటే ఈ పేరు ఉంటే కొంచెం ప్రేక్షకులు ఎట్రాక్ట్ అయ్యేలా ఉన్నారు. అందుకని..." నసిగాడు సుబ్బారావు.

"అదేం కాదులే గాని... అందరూ క్రొత్త కుర్రాళ్ళతో, నటీనటులతో స్పెషల్ ఎఫెక్ట్స్‌తో ఓ సిన్మా చెయ్యవయ్యా... అదెలాగో నే వివరిస్తా! ఆ పన్చేయ్... నీకు సిన్మా తీసిన తీసిన సరదా తీరుద్ది... నలుగురు క్రొత్త వాళ్ళకి అవకాశం ఇచ్చినట్టూ ఉంటది..."

సుబ్బారావుకిది బాగా నచ్చడంతో... అందుకు సరేనన్నాడు. అన్నీ కుదరడంతో భాను ప్రకాష్ సహకారంతో వెంటనే షూటింగ్ మొదలైంది.

పేరుకి సుబ్బారావే నిర్మాతే గాని... భాను ప్రకాష్ అంతా తానై షూటింగ్ వ్యవహారమంతా నడపసాగాడు.

తెల్లవారే తన ఇంట్లోప్రత్యక్షమైన సుబ్బారావుని తేరపార చూశాడు భాను ప్రకాష్.

అంతటితో ఊరుకోకుండా "ఏంది కద!" అన్నాడు.

"ఏం లేదు సార్! ఎలాగూ అందరూ క్రొత్త వాళ్ళు కదా!...అందుకని నేను కూడా రామానాయుడులాగా, కోడి రామకృష్ణలాగా, దాసరి నారాయణరావు లాగా ఓ చిన్న పాత్ర వేస్తానండీ!" భయపడుతూ అడిగాడు సుబ్బారావు.

"సినిమా నిర్మాతవే నువ్వు. అంతా నీఇష్టం. అయినా నువ్వేం హీరో పాత్ర వేస్తాననడం లేదుగా...ఓపెనింగ్స్ రావేమోనని భయపడడానికి, హీరో తండ్రి పాత్రో, విలన్ తమ్ముడు పాత్రో కదా! అలాగేలే డైరక్టర్‌కి చెబ్దాంలే." భాను ప్రకాష్ మాటివ్వడంతో ఉబ్బి తబ్బిబ్బయి పోయాడు సుబ్బారావు.

షూటింగ్ కార్యక్రమాలు ఊపందుకున్నాయ్.

నాన్‌స్టాప్‌గా జరుగుతున్న షెడ్యూల్స్‌తో అంతా హడావుడిగా ఉంది. జూనియర్ ఆర్టిస్టులంతా మేకప్‌లు వేసుకుని సిద్ధమవుతున్నారు.

జనరేటర్ ఆన్ చేసి లైటింగ్ ఏర్పాట్లు



చూస్తున్నాడు కెమేరామెన్.

భానుప్రకాష్ సెట్‌లోకి ప్రవేశించాడో లేదో అంతా నిశ్శబ్దంగా మారిపోయింది.

అందంగా ముస్తాబైన జూనియర్ ఆర్టిస్టులైన అమ్మాయిల మధ్య నల్లగా, తుమ్మ మొద్దులా ఒకామె కూర్చొని ఉండడం భానుప్రకాష్ దృష్టిలో పడింది.

"ఎవరీమె? బయటకి పంపండి! దొండపళ్ళ మధ్య కాకిలా ఉంది..."

భానుప్రకాష్ కేకలు వినీ వినడంతోనే పరుగెత్తుకు వచ్చాడు సుబ్బారావు.

"సార్! సార్!! ఆమె వేరెవరో కాదు.... నా భార్య! తనూ కూడా ఏదో ఒక పాత్ర చేస్తానని భీష్మించుకు కూర్చుంది. హీరోయిన్ అత్త వేషం వేసి, హీరోయిన్‌ని సాధించి, వేధించే పాత్రలో నేచురల్‌గా నటిస్తానని గొడవ చేస్తోంది. ఈ సిన్మా కోసం తెచ్చిన డబ్బులో సగం ఆమెదే సార్..." ప్రాధేయపడినంత పనిచేశాడు సుబ్బారావు.

వద్దని వారించలేక డైరక్టర్‌తో పాత్ర గురించి మాట్లాడుకోమని చెప్పాడు భానుప్రకాష్.

"...ఇంకా మా అమ్మ కూడా ఏదైనా ముసలి బామ్మ పాత్ర ఉంటే ఇయ్యమంటుంది. నన్ను పెట్టుకుంటే హాయిగా మేకప్ ఖర్చులు మిగులుతాయి కద్రా అంటుంది ... మా అబ్బాయొకడు డాక్టర్‌చదువు చదవమంటే ఏక్టరవుతానని గోల చేస్తాడు..." ఇంకా ఏదో చెప్పబోయాడు సుబ్బారావు.

"ఇంకెందుకు ...మీ కుటుంబమంతా తలో పాత్ర వేసేసి ఏవైనా పాత్రలు మిగిలిపోతే... మీరే డ్యూయెల్ రోల్, ట్రిపుల్‌రోల్ వేసేయండి... ఎవరికీ పారితోషికమూ ఇవ్వక్కర్లేదు. సిన్మాను కూడా సంవత్సరం కాదు.. కాదు...పది సంవత్సరాల పాటు మీ ఇంట్లోనే ప్రదర్శించుకుని రికార్డు కొట్టచ్చు. సిన్మా ఆడలేదని బాధ పడనక్కర్లేదు" కోపంతో ఆయనన్న మాటలు విన్నాక... సుబ్బారావు కాళ్ళు గజగజ లాడాయ్!

అంతలోనే తేరుకొని– "సారీ సార్! ఊరికే అన్నాను. మా యావిడికి ఛాన్సిస్తే చాలులేండి" అన్చెప్పి అక్కడ నుండి నెమ్మదిగా బయటకి ఉడాయించాడు సుబ్బారావు.

✦✦✦

"ఆడియో రిలీజ్ కాకుండా డైరెక్టుగా ట్రిపుల్ ప్లాటినం డిస్క్ ఫంక్షన్ పెట్టడమేంటి డైరక్టర్ గారూ... ఇలా చేస్తే ఆడియన్స్ ఎలా నమ్ముతారు మనల్ని?" అమాయకంగా ప్రశ్నించాడు సుబ్బారావు.

"రెండు మూడు ఫంక్షన్లు ఎలా చేస్తామంటారండీ మీరు ... ఇలా అయితే బడ్జెట్ అంతా ఫంక్షన్లకే ఖర్చయిపోతుంది." డైరక్టర్ చెప్పింది విన్నాక సరేనన్నాడు.

## సినీతులు

అద్భుతం జరిగేటప్పుడు ఎవ్వరూ గుర్తించలేరు. జరిగిన తర్వాత ఎవరూ గుర్తించవలసిన అవసరం లేదు.





"నీ సిన్మాకి నువ్వే హీరో ... అనే వర్కింగ్ టైటిల్ అనుకున్నాం కదా?"

"హీరోని నేను కాదు కదండీ ... నాది హీరో తండ్రి పాత్రే కదా?" సుబ్బారావు నసిగాడు.

"అందుకే ప్రొడ్యూసర్‌గారూ... సినిమా పేరు మనం మార్చేస్తున్నాం. మన సిన్మా పేరు యాక్షన్ 5డి" నవ్వుతూ చెప్పాడు.

ఆనందిచాల్సింది పోయి ఆశ్చర్యంగా ఫేస్ పెట్టాడు సుబ్బారావు.

"అదే సార్... త్రీడీలోనైతే మన మీదకి పాత్రలు దూసుకొస్తున్నట్లుంటుంది. ఫోర్‌డీలో అయితే వాసనలూ, తడి కూడా తగుల్తుంది... ఇక ఫైవ్‌డీ అంటారా... మనమున్న ప్రదేశం కూడా కదుల్తున్నట్లు ఎఫెక్ట్సు సృష్టిస్తాం... తెలుగులో తొలి ఫైవ్‌డీ సినిమా మనదే అవుతుంది. ఈ రకంగా మనం చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతాం. ఏమంటారు?"

సుబ్బారావు శరీరం సన్నగా కంపించింది. ఆనందంతో కళ్ళ నుండి భాష్పాలు జలజలా రాలాయి.

"డైరక్టర్ గారూ ... మీరు చేయబోయే మేలు ఏ జన్మకీ మరచిపోలేను. ఒక్క సినిమాతో నన్ను అందనంత ఎత్తుకు తీసుకుపోతున్నారు. డబ్బుంటే నా తర్వాత సిన్మా ... ఆ తర్వాత సిన్మా ... ఆ తర్వాతి తర్వాతి సిన్మా అన్నీ మీతోనే తీస్తా ! అయితే నాదో చిన్న రిక్వెస్టు ... ప్రివ్యూ షో మాత్రం మా ఊరి థియేటర్‌లోనే ఫుల్ ఎఫెక్ట్సుతో ప్రదర్శించాలి. దానికి మీతో



సహా... మన యూనిట్ సభ్యులంతా హాజరవ్వాల" అనునయించాడు సుబ్బారావు.

డైరక్టరు సైతం అంతే అప్యాయంగా అవునని తలాడించాడు.



"యాక్షన్ ఫైవ్‌డీ" సినిమా ప్రీవ్యూ ప్రదర్శన సందర్భంగా అమలాపురం పండుగ కళ సంతరించుకుంది.

ఊరంతా సంక్రాంతి అన్నట్లు మామిడి తోరణాలతో రంగురంగుల జెండాలతో డిజిటల్ బోర్డులతో అందంగా అలంకరించారు.

ఒక్కసారిగా సుబ్బారావు పేరు ఊర్లో మార్మోగిపోయింది. సుబ్బారావు చిన్నప్పటి స్నేహితులూ, ఊర్లోని పెద్దలూ, సినిమా ప్రముఖులతో కళకళలాడుతూంది.

ఉద్విగ్న క్షణాల నడుమ సుబ్బారావు సినిమా ప్రివ్యూ షో ప్రారంభమైంది .

అసలే క్రొత్త సినిమా, ఆపై తొలి తెలుగు ఫైవ్‌డీ మొదటి ప్రదర్శన – అందరూ టెన్షన్‌గా ఉన్నారు. ఇప్పటిదాకా త్రీడీ సినిమాయే చూడటానికి నోచుకోని చాలామంది త్రీడీ కళ్ళద్దాలు పెట్టు కుని ఏకాగ్రతతో సినిమా చూసే పనిలో పడ్డారు.

ప్రారంభం కాగానే... ప్రేక్షకులందరి మీద పూలవర్షం కురిసింది. బంతిపూల రెమ్మలు, మల్లెపూలు, చామంతులు మీద పడడంతో,



వెర్రినాగన్న

నాగ్రాజ్.











సువాసనలు సిన్మా హాలంతా వ్యాపించాయి.

సిన్మాలో అది భాగమా, లేక ప్రారంభ సూచనగా ఈ పూలవర్షం కురిపించారా అనే సందేహం ప్రేక్షకులకు వచ్చినా, ఆనందంగా ఆ చర్యను ఆస్వాదించారు.

సిన్మా నడుస్తూనే వుంది.

హీరో డైరెక్టుగా హీరోయిన్ పెదాలని గుంజేస్తూ ముఖాముఖి ఫ్రెంచ్ కిస్సొకటి ఇచ్చాడు. ఫైవ్‌డీ ఎఫెక్టుతో హీరో డైరక్టుగా ఆడియన్స్‌నే ముద్దు పెట్టుకున్నంతగా గాబరా పడ్డారు ప్రేక్షకులంతా.

"ఛీ! ఇప్పుడొద్దు... మా ఆయన ప్రక్కనే ఉన్నారు" అని ఆడ ప్రేక్షకులనుకుంటే హీరోని ముక్కలు ముక్కలుగా నరికేద్దామని సీట్లో నుండి కోపంగా పైకి లేచారు మగ ప్రేక్షకులు.

ఈ సన్నివేశం చూసి ముందు ఆతృత చెందినా... డైరక్టర్ వైపు మెచ్చుకోలుగా చూశాడు సుబ్బారావు. సీన్ మారిపోగానే ఇది సినిమా కదయని తెలిసొచ్చి మరలా ఎవరి సీట్లలో వాళ్ళు కూర్చున్నారు.

తర్వాతి సీను మొదలైంది.

హీరో హీరోయన్లు పాట పాడుకుంటూ గెంతులు వేసుకుంటూ చీమలు దూరని చిట్టడవికి వెళ్ళిపోయారు.

దూరటానికి సందు దొరక్క చీమలన్నీ గుంపులు గుంపులుగా నిరీక్షించి ... నిరీక్షించి ఒక్కసారిగా తిరుగు ముఖం పట్టాయి.

ఎందుకో గాని రివర్స్ అయినప్పుడు అవి చాలా వేగంగా ప్రేక్షకుల మీదకి దూసుకొచ్చినట్లయింది.

ఆడియన్స్ కొంచెం ఆ దూకుడికి బెంబేలు పడ్డారు.

"ఫైవ్‌డీ అన్నారు గాని – ఇది వట్టి త్రీడీ లాగనే వుంది. అని ఎవరినుండో వచ్చిన మాట డైరక్టర్ చెవిలో పడింది.

కొంచెం సేపట్లో ఏం జరిగిందో తెలీదు. ప్రేక్షకులంతా ... 'అమ్మో చీమలు ... అయ్యో చీమలు కుట్టేస్తున్నాయిరా బాబూ! ఈ ఎఫెక్టు చాలు ఆపండిరా బాబు" కేకలు వేయసాగారు.

"ఒక్కసారి పుట్టను కదిలించాక... ఇక చీమల్ని వెనక్కి పంపడం కుదరదు... కొంచెం సేపటిలో అవే పోతాయిలెండి." ఎనౌన్స్‌మెంటు వినబడింది.

హీరో హీరోయిన్లు ఈసారి కాకులు దూరని కారడవి దగ్గరికి వెళ్ళారు.

దూరడానికి దారిలేక కాకులు రివ్వున ప్రేక్షకుల మీద కొచ్చి పడ్డాయి. కావ్ కావ్ మన్న కేకలు ఎక్కువైపోవడంతో గాబరా పడి ఆడియన్సందరూ ఆందోళన చెందారు. కాస్సేపటిలో కాకులన్నీ చెట్ల మీదకి చేరి, తాపీగా రెట్టలు వేయసాగాయి. ప్రేక్షకుల మీదకి సరాసరి వచ్చి పడడంతో గబ్బుకంపు రాసాగింది.

"ఏందయ్యా డైరెక్టరూ... నిజంగానే రెట్టలు పడుతున్నాయ్?" అడిగాడు సుబ్బారావు.

"ఈ ప్రక్కన శ్మశానం ఉంది. పెద్దకర్మ జరుగుతోంది. పిండాకూడు కాస్త ఎక్కువ తయారు చేసి థియేటర్ పైకి కాకులొచ్చే ఏర్పాట్లు చేశాం. దానికోసం తాత్కాలికంగా థియేటర్ రూఫ్ కొన్నిచోట్ల తొలగించాల్సి వచ్చిందంతే..." డైరక్టర్ సమాధానం విని సీన్






ఎప్పుడు మారుతుందాయని ఎదురు చూడ సాగాడు సుబ్బారావు కూడా.

ప్రేక్షకుల కరతాళ ధ్వనుల మధ్య రెయిన్ సాంగ్ మొదలైంది.

ఈ వర్షపు నీరుతో కాకి రెట్లని కడికేసు కోవడానికి ప్రేక్షకులంతా సంబరపడ్డారు.

వర్షము కురుస్తూండగానే ... ఓ పాముల గుంపు కొండల మీద నుండి సరాసరి ప్రేక్షకుల మీదకి వస్తోంది. ఆ ఎఫెక్టుకి గాబరా పడి నిజంగానే పాములు కూడా సీట్ల మధ్యకి వచ్చే స్తాయని భయపడి పారిపోదామని ప్రేక్షకు లంతా సీట్లలో నుండి లేచిపోయారు. అప్పటికి గాని వారికి తెలియ లేదు కాళ్ళకి సగం దాకా నీళ్ళొచ్చేశాయని!

ఈ మాత్రం వర్షానికే ఇన్ని నీళ్ళొచ్చేశాయని ఆలోచించే లోపల సినిమాలో వరదలో హీరో హీరోయిన్లు 'పడవ' మీద కూడా 'లాహిరి ... లాహిరిలో' యని పాతపాట ఎఫెక్ట్సుని రాగ యుక్తంగా ఆలపించడం మొదలైంది.

అప్పటికే ప్రేక్షకులంతా తలోదిక్కుకి పరి గెత్తారు. 'ఎఫెక్టుకోసమే కొంచం వాటర్ వది లాం...డీవాటరింగ్ ఎఫెక్ట్సుతో బయటకు పంపేస్తాం... దయచేసి కూర్చోండి" ప్రకటన మైకులో వస్తున్నా గాని ఎవరూ వినిపించుకునే స్థితిలో లేకుండా పోయారు.

"ఇదేం సిన్మాయ్యా బాబూ! మా ప్రాణాలతో చెలగాటం ఆడడం కాకపోతే. ఇంకా నయం పాముల్ని మీదకు పంపించి కరిపించావు కాదు. ఇంకా ఉంటే ఏనుగులతో ఎఫెక్టు అని తొక్కించేశావు కాదు."

అప్పటికే డైరెక్టరు పరారయి పోవడంతో సుబ్బారావు అడ్డంగా దొరికిపోయాడు.

ప్రేక్షకులను విపరీతంగా బెంబేలెత్తించి భయభ్రాంతుల్ని చేసిన విషయం మీడియాలో ప్రముఖంగా చోటు చేసుకోవడంతో సెన్సార్ వారు వారిచ్చిన సర్టిఫికెట్టు వెనక్కి తీసేసుకుని శాశ్వతంగా ప్రదర్శన నిలిపేస్తున్నట్లు ఆర్డర్ వేసేశారు.

సినిమాని ఎక్కువ రేటిచ్చి కొనేసిన డిస్ట్రిబ్యూ టర్లంతా దాడి చేస్తారనే భయంతో సుబ్బారావు అమలాపురం నుండి అంతర్ధానమై అమర్‌నాథ్ గుహల్లోకి పారిపోయాడు. 

నవ్వు నాలుగిందాల చేటు... ఇది నిన్నటి నానుడి!
నవ్వు నాలుగందాల దీటు... ఇది నేటి న్యూనుడి!!
కావాలంటే... ఓసారి నిండుగా నవ్వుతూ అద్దంలో చూసుకోండి!
నవ్వేప్పుడు మీరెంతో అందంగా కన్పిస్తారు.
నిజం! అందుకే అందర్నీ ఆనందంగా నవ్వించాలని ఈ
మల్లెపందిరి నేయడం ప్రారంభించాను. -జంధ్యాల






జనవరి అంటేనే పండుగ !
మన హాస్యబ్రహ్మ శ్రీ జంధ్యాల జయంతి
కూడా జనవరిలోనే
ఆయనపెన్'చి పెద్ద చేసిన
ఈ
మల్లె పందిరి
చిత్రాన్ని 'కలం'కరించిన
డా॥ దివాకర్ చేసిన
వెండితెర నవ్వులీకరణ
వచ్చే సంచిక నుంచే ప్రారంభం!

# 'ఫన్'తోషం


నేనూ మా ఆవిడా ఓ అండర్‌స్టాండింగ్‌కు వచ్చాం... నేను తాగి ఇంటికెళ్తే నన్ను తిట్టకూడదు.. తను సీరియల్స్ చూస్తుంటే నేను తిట్టను


ఈరోజుల్లో యూత్‌కు ఎంత పెద్ద సెల్‌ఫోన్ అయితే అంత ఫ్యాషన్!!




క్రైమ్ న్యూస్ చదువుతున్నది....
TV 420


వరాల సంగతి తర్వాత ముందీ పర్వతం మీద నుంచి కిందికి దిగబడండి


దెయ్యాలంటే ఇంతగా భయపడేదాన్ని



నవ్వుల రారాజు — ఫ్లాష్‌బ్యాక్

# చార్లీ చాప్లిన్ ది గ్రేట్!

**విష్ణుభొట్ల రామకృష్ణ**

ఫోన్: 9 4 4 0 6 1 8 1 2 2

**రెండుపెళ్ళిళ్ళు విడాకులు అవటంతో అతని కీర్తి ఆడుగంటింది. ధనం విపరీతంగా ఖర్చయింది. అయినా అతనిలో స్త్రీ వ్యామోహం తగ్గలేదు. మరియు స్త్రీలతో అతిసన్నిహితంగా తిరగటం వలన ఆ అతిచనువు మరోవివాహనికి దారితీసింది. ఆమె కూడ తను తీసిన సినీమాలో నటించిన కథానాయిక కావటం విశేషం. ఆమె పేరు ఫాలెట్. ఫాలెట్ చాప్లిన్ తో మోడర్న్ టైమ్స్, దిగ్రేట్ డిక్టేటర్‌లో నటించింది. ఆమె చాప్లిన్‌ని విపరీతంగా ప్రేమించింది. వీరు 1936వ సంవత్సరంలో. వివాహం చేసుకున్నారు. ఫాలెట్ చాప్లిన్‌ను, అతని ఇద్దరి కుమారులను ఎంతో ప్రేమగా చూసుకొనేది కాని ఆమె చాప్లిన్ సినిమాలే కాక ఇతరుల సినీమాలలో నటించడం చాప్లిన్‌కు నచ్చేది కాదు.**



ఈ విషయం గురించి ఇద్దరి మధ్య మన స్పర్ధలు రాసాగాయి. చాప్లిన్‌కు ఫాలెట్ పై లేని పోని అనుమానాలు పెరగసాగాయి. అవి ముదిరి చివరకు ఫాలెట్‌తో కూడ విడాకులు తీసుకోనే వరకు వచ్చాయి. దీనితో ఇద్దరూ విడిపోయారు.

సినిమాలలో ఏ విధంగా వివాహం, విడాకులు వంటివి వరుసగా జరుగుతాయో అదే విధంగా చాప్లిన్ జీవతంలో జరగసాగాయి. మూడవ సారి విడాకులు తీసుకొనే సమయానికి చాప్లిన్ వయస్సు 51 సంవత్సరాలు.

పేదరికాన్ని గురించి వారి బాధల గురించి అనేక సినిమాలు తీసిన చాప్లిన్ తన నిజ జీవితంలో ఎంతో పేదరికం అనుభవించడం వలన తన జీవితాన్ని ఎప్పుడూ విలాసవంతగా గడపటానికే ఇష్టపడేవాడు. డబ్బు సంపాదన, అందమైన వస్తువులు కోనటం, స్త్రీలను వ్యామోహించి వారిని పొందటం లేకుంటే వంటరిగా జీవించటంతో పాటు సామాజిక, ఆర్థిక, రాజకీయ బాధలతో రకరకాల నిందారోపణలతో దేశం తిరుగుతూ వివాహం చేసుకోలేక, చేసుకున్నా వాటిని నిలుపుకోలేక తన జీవితాన్ని ధనాన్ని ఎంతో వృథ చేసుకున్నాడు చాప్లిన్.

తాను అమెరికాలో నివశిస్తు, రష్యాకు మద్దతు పలికాడు. కమ్యూనిస్ట్ సిద్ధాంతాలంటే ఇష్టం అంటూ వాటిని ప్రచారం చేసాడు. కాని తాను కమ్యూనిస్ట్ కాదంటాడు. ఎన్నో దేశాలు తిరిగినా రష్యాకు మాత్రం వెళ్ళలేదు. కమ్యునిజాన్ని అంగీకరించినట్లు ఎక్కడా చెప్పలేదు.

పోనీ ప్రజాస్వామ్యవాదిగా, మనవహక్కుల కోసం, మానవ స్వాతంత్ర్యం కోసం, మానవ ప్రగతికోసం పోరాడింది లేదు. కళకారుడిగా చాలా గొప్ప నటుడు అయినప్పటికి చాప్లిన్ వైరుధ్యాలపుట్ట చారిత్రక అవగాహన, రాజకీయ పరిజ్ఞానం చాప్లిన్‌లో లోపించటం వలన నిర్థిష్టమైన జీవిత దృక్పథాన్ని ఏర్పరచుకోలేక పోయాడు. ఒక గమ్యాన్ని చేరుకోలేక వంటరిగా మిగిలిపోయాడు చాప్లిన్.

చాప్లిన్ తన బాల్యం నుండి వృద్ధాప్యం వరకు ఎన్నో జీవితానుభవాలను చూసాడు.

తాను పెరిగిన ఇంగ్లాండు, బ్రిటన్ ధనవంత దేశమైనా అక్క డ ఎందరో బీదరికంలో

మగ్గటం చూసాడు.

తాను బీదల పక్షమేనని నిరంకుశత్వానికి వ్యతిరేకం అని, మానవ స్వేచ్ఛ కోసం పోరాటాలకు మద్దతునిస్తానని అంటూ ఎన్నో చెప్పిన చాప్లిన్ తాను కమ్యూనిస్ట్ కాలేక, కమ్యూనిస్ట్‌గా ముద్ర వేయించుకున్నాడు. ఇది చాప్లిన్ రాజ కీయ చరిత్ర అవగాహనలో పెద్ద లోపం. చివ రకు ఆయన ఒక కళాకారుడిగానే మిగిలి పోయాడు.

అమెరికాలో అప్రతిష్ట పాలైదేశ బహిష్కరణకు గురైన చాప్లిన్, ఇంగ్లాండ్, ఫ్రాన్స్, చైనా, జర్మనీ వంటి దేశాలు తిరిగాడు. చివరకు హాంకాంగ్‌లో స్థిరపడాలనుకున్నాడు. కాని

పోటిలో ఒకరిని విజయం వరిస్తుంది. మరొకరిని అపజయం వరిస్తుంది. అందుకే నేను ఎవరిని ప్రేమించను అంటాడు.

చాప్లిన్ జీవితం నాశనమవటానికి, అతని సంపద పోవటానికి, అతని కీర్తి నశించటానికి కారణం అతనికి స్త్రీలపైగల వ్యామోహం స్త్రీలతో తిరగటమే.

సమాజంలోని వ్యక్తులను గురించి మాట్లాడుతూ తారలు–వెలుగుని చల్లదనాన్ని కల్గించలేవని–సినిమాతారల గురించి మాట్లాడతాడు. అలాగే రచయితల గురించి మాట్లాడుతూ రచయితలు ఎవరికి ఏమీ చెప్పరని పుస్తకాల్లో తమ విజ్ఞానాన్ని దాచేస్తారని



అతను స్విట్జర్లాండులోని ఒక చిన్న గ్రామంలో స్థిరపడ్డాడు.

తన శేష జీవితం మొత్తం అంటే దాదాపు 25 సంవత్సరాలు స్విట్జర్లాండ్ లో గడిపాడు.

చాప్లిన్ తన సుదీర్ఘ జీవితంలొ అనేక రకాలైన వ్యక్తులను చూసాడు... కలిసాడు.

చాప్లిన్‌ను అందమైన ప్రముఖమైన స్త్రీలు ఎందరో ప్రేమించారు. కాని ఆయనకు మటుకు వారి ప్రేమపై నమ్మకం, విశ్వాసం లేదు.

అందుకే ప్రేమ గురించి మీ అభిప్రాయం చెప్పమని చాప్లిన్‌ని ప్రశ్నించినప్పుడు–

ఆయన ప్రేమ అనేది ఒక పోటి. ఈ

అభిప్రాయ పడ్డాడు.

చిత్రకారులతో సాంగత్యం విసుగని, సంగీత కళాకారులు అందరికి సహకరిస్తారని, కవుల సాంగత్యం గొప్పదని మంచిస్నేహాన్ని కురిపిస్తారని చాప్లిన్ అనేక మార్లు అనేక సందర్భాలలో ప్రస్తావించేవాడు.

చాప్లిన్ తన జీవితం చివరి దశలో అంటే 1967 లో తన 76వ ఏట "ఎకౌంటెస్ ఫ్రమ్ హంగ్‌కాంగ్" అనే చిత్రాన్ని నిర్మించాడు.

ఈ చిత్రంలో చాప్లిన్ హీరో కాదు. చాప్లిన్ ఈ సినిమాలో ఒక్క నిమిషం కనబడుతాడు. అది కూడ హొటల్ బేరర్‌గా.

ఈ సినిమా విజయవంతం కాలేదు. అసలు ఈ సినిమా చాప్లిన్ ఎందుకుతీసాడో? ఎవరికి అర్థం కాలేదు.

చివరకు చాప్లిన్‌కు కూడ అర్థం కాలేదు.

76సంవత్సరాలు విసుగు విరామం లేకుండా సినిమాలు తీసిన చాప్లిన్‌ను 1962లో ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయం డాక్టర్ ఆఫ్‌లెటర్ర్ గౌరవ డాక్టరేట్ బిరుదును ఇచ్చింది.

1975వ సంవత్సరం చాప్లిన్ నైట్ (knight) బిరుదుతో బ్రిటిష్ ప్రభుత్వం సత్కరించింది.

అమెరికా ప్రభుత్వం చాప్లిన్‌ను అవమాన పరిచినా, బహిష్కరించినా, ఆయన అవసాన దశలో అంటే 1976 లో అమెరికా మరల ఆయన్ని గౌరవించక తప్పలేదు.

1977 డిశంబరు 25న క్రిస్టమస్ నాడు తెల్లవారుజామున 4గంటలకు నిద్రలోనే చాప్లిన్ ఈ ప్రపంచాన్ని వదలి, మరో ప్రపంచంలోకి వెళ్ళిపోయాడు.

అక్కడ తన హాస్యాన్ని అందించటానికో లేక మరో అద్భుతం సృష్టించటానికో ఎవరికి తెలియదు. అలా తెలుసుంటే చాప్లిన్ అసలు తన జీవితాన్ని – ఇలా అష్టకష్టాల పాలు చేసుకొనేవాడు కాదు కదా!

అటువంటి గొప్ప నటుడు ఉద్భవిస్తాడని తెలిస్తే ప్రతిదేశం ముందుకెళ్ళిస్వాగతం పలికేది కదా! ఏది ఏమైనా ఒక మహా నటుడు తాత్వికవేత్త, బహుముఖ ప్రజ్ఞాశాలి తనువు చాలించటం ఈ ప్రపంచానికి తీరని లోటు.

ఒక మహానటుడుని మహా కష్టజీవిని మనం ఒకే వ్యక్తిలో చూడగలం అటువంటి మహావ్యక్తి చాప్లిన్.

చాప్లిన్ తారువాత ఎందరో మహానటులు, హాస్యనటులు పుటనా... వారంత చాప్లిన్ కంటే నటనలో వైవిధ్యం చూపిన, చాప్లిన్ వంటి జీవితం–జీవనం – ఆనందం – కష్టం –సుఖం చూసి ఉండరు.

అందుకే చాప్లిన్ పైకి కనిపించే ఒక హాస్య నటుడు లోపల... అనేక సుడిగుండాల మధ్య నావను నడిపే నాయకుడు వున్నాడు... ఆయనే దిగ్రేట్ చార్లీ చాప్లిన్.

**సమాప్తం**




# ఉత్త కవరొచ్చింది

కోలపల్లి ఈశ్వర్
09884680342

ఎవరి దగ్గర్నుంచబ్బా?... అనుకుంటూ ఆ ఎన్వలప్ కవర్ని ఓమారు అటూ ఇటూ తిప్పి చూశాను. ఫ్రమ్ అడ్రస్ లేదు. టు అడ్రస్ నాదే. కానీ, దస్తూరీ మాత్రం పరిచయమైంది కాదు.

'ఎవరబ్బా ఈ స్ట్రేంజరు? అనుకుంటూ కొంచెం ఆత్రంగానే కవర్ని ఓపెన్ చేశాను. తీరా చూస్తే ఏముంది? ఉత్త కవరు! అందులో 'ఏమియునూ లేదు! కవరు ఊడిపోయి ఉంటే, పోని, పోస్ట్‌లో ఉత్తరం ఎక్కడన్నా జారిపోయిందేమో ననుకోవచ్చు కానీ, కవరు దృఢంగానే ఉంది.

చాలా చక్కగానూ, గట్టిగానూ, అంటించే ఉంది. నేను చించాకే చిరిగింది. అంటే, రాసిన ఉత్తరాన్ని (కాగితాన్ని) కవర్లో పెట్టడం మర్చిపోయి, ఉత్త కవర్నే అంటించి పోస్ట్ చేసేశారన్న మాట ఎవ్వరో? అంత మతి మరుపు మంగయ్య ఎవరయ్యుంటారబ్బా?

సాధారణంగా నాకు నిడదవోలులో ఉంటున్న మా తమ్ముడి దగ్గర్నుంచీ, హైదరాబాద్‌లో ఉంటున్న నా ఫ్రెండ్ అనంత్ దగ్గర్నుంచీ, కాకినాడలో ఉంటున్న మా తోడల్లుడు శ్రీనివాస్ దగ్గర్నుంచీ, అమలాపూరంలో ఉంటున్న మా రాజేశ్వరక్కయ్య దగ్గర్నుంచీ- ఉత్తరాలొస్తుంటాయ్.

నేను సెల్‌ఫోన్ వాడనని నా సర్కిల్లో ఉన్నవాళ్లందరికీ తెలుసు, అందుకనే వాళ్లు ఉత్తరాలు రాస్తుంటారు.




కవరు మీదున్న దస్తూరీ వాళ్లలో ఏ ఒక్కరిదీ కాదు మరెవరు రాసినట్టు?

అసలు ఈ కవరు ఏ ఊరినుండి వచ్చినట్టు? పోస్టల్ ముద్రని బట్టి తెలుసుకోవచ్చు కదాని, కవరు మీద ఉన్న రెండు ముద్రలనీ పరీక్షగా చూశాను.

ఒకటి మా ఊరి పోస్టాఫీస్ వాళ్లు వేసింది. అది స్పష్టంగానే ఉంది.

రెండోది... అంటే ఉత్తరం పోస్ట్ చెయ్యబడిన పోస్టాఫీస్‌ది. ఇంకు ఎక్కువగా పడ్డం వల్ల నల్లగా, చదవడానికి ఏమాత్రం వీలు కాకుండా ఉంది.

చాలా సేపు చాలా చాలా పరీక్షగా చూశాక, అదేదో '......లూరు' నుండి పోస్ట్ చేయబడిందని మాత్రం అర్థమైంది.

అంటే 'ఎల్.యు.ఆర్. యు' అనే నాలుగు అక్షరాల్ని మాత్రమే చదవగలిగానన్న మాట.

'లూరు' అంటే – ఏ'లూరు' అనుకోవాలి! ఏలూరే కావచ్చు. దెందులూరు కావచ్చు. కడలూరు కావచ్చు. సాలూరు, పాలూరు, నిడవలూరు కావచ్చు. నా బొందలూరు.... ఇంకేదయినా కావచ్చు.

'లూరు' తో అంతమయ్యే ఊళ్లు ఆంధ్ర దేశంలో ఎన్నున్నాయో ఎవడికి తెలుసు?

ఈ 'లూరు' ఏ'లూరు' అయ్యుంటుందబ్బా? అనుకుంటూ నేనలా బుర్రబద్దలు కొట్టుకుంటుండగా– "ఏంటండీ! ఆ కవర్ని పట్టుకుని అంతసేపు నలుపుతున్నారు? ఎవర్రాశారేంటి? మీ చాదస్తం కాకపోతే ఈమెయిల్ రాజ్యమేలుతుంటే కనీసం సెల్ ఫోనయినా లేకుండా ఏంటండీ, మీరు? బాగుంది మీ సంబరం?" అంటూ నా చెంతకొచ్చింది మా శ్రీమతి.

గమ్మత్తేవిటంటే, మా శ్రీమతి పేరు కూడా శ్రీమతే!

"ఇదా!... దేష్‌లూరు నుండి అనామకరావ్ రాశాడు". అన్నాను నేను నవ్వుతూ.

"దేష్‌లూరేంటీ?... అనామకరావేంటీ?" అని ఆశ్చర్యంగా అడిగింది మా శ్రీమతి.

నేను విషయం వివరించాక– "ఏదీ ఆ కవరిలాగివ్వండీ!" అనడిగి తీసుకుంది.

"ప్చ్!... ఎవరో అర్థంకాట్లేదే?..." అంది.

అడ్రస్‌కేసి కాసేపు పరీక్షగా చూశాక, "సరే, ఎవడో ఒక గన్నయ్య! ఇప్పుడు దాన్ని గురించి ఎంతసేపు బుర్ర బద్దలు గొట్టుకుంటే మాత్రం ప్రయోజనం ఏంటీ?" అనేశాను.

అవునవునంటూ తను లోపలకు వెళ్లి పోయింది.

నేను మాత్రం ఇంకా దాని గురించే ఆలో చిస్తూ ఉండిపోయాను.

ఏయే 'లూర్ల'లో మాకు బంధువులున్నారా అని మననం చేసుకోవడం ప్రారంభించాను.

సాలూరు లో శంకర్రావనే దూరపు చుట్టం ఒకాయన ఉన్నాడు. కానీ, మా మధ్య ఏనాడూ ఉత్తరప్రత్యుత్తరాలు లేవు. దెందులూరులో మా చినతాతయ్యగారూ, ఆయన పిల్లలూ, పిల్లల పిల్లలూ చాలా మందే ఉన్నారు. కానీ, మా మధ్య పెద్దగా రాక పోకలు గానీ ఉత్తరాలు గానీ లేవు ఏనాడూ.

కైకలూరులో సత్తిబాబని నా ఫ్రెండ్ ఒకడు ఉన్నాడు గాని, వాడెప్పుడూ ఉత్తరాలు రాయ డు. ఏలూరులో ఆదినారాయణ అని నాకు వరసకి మామయ్యే పెద్దమనిషి ఒకాయన ఉన్నాడు. ఆయన ఏడాదికి రెండుమూడుసార్లు పిల్లాడితో సహా మా ఇంటికి వేంచేస్తూ ఉం టాడు. ఉత్తరాలు రాసే అలవాటు మాత్రం బొత్తిగా లేదు... కాని వచ్చి వారాల తరబడి తిష్ఠవేసె అలవాటు మాత్రం పుష్కిగానే ఉంది.

నలుగురు పిల్లలు, ఆయన, వాళ్ళావిడ మొత్తం అరడజనుమందొచ్చి పడుతుంటారు అప్పుడప్పుడు.

ఖర్చు మాట ఎలా ఉన్నా ఆ పిల్లలు పిల్లలు కారు. ఒట్టి కోతి మూక, ఉన్నాన్నాళ్లూ మా ఇంట్లో ఉన్నా సకల వస్తువులూ... ఆట వస్తువులే వాళ్ళకి.

పింగాణీ పళ్ళేలు బొమ్మకార్లయి పోతుం టాయ్. టీపాయ్‌ని తిరగేస్తే లారీ అయి పోతుంది రేకుకుర్చీలు డప్పులై ధమ ధమా మోగిపోతుంటాయ్. ఎలక్ట్రికల్ ఐరన్ బాక్స్ తాడుతో లాక్కెళ్లే ఎడ్ల బండై పోతుంది... ఇలా ఒకటేంటి? దేన్నయినా ఆట వస్తువుగా మార్చే యగల సమర్థులు వాళ్లు. వాళ్లు ఉన్నన్నాళ్లూ ఇల్లు ఇల్లులా అనిపించదు. ఓ చిన్న సైజు నరకంలా అనిపిస్తూ ఉంటుంది.

అది భరించలేక క్రితంసారి వాళ్లు మా ఇంటికి వచ్చినప్పుడు-'ఈసారి మీరొచ్చే ముందు ఉత్తరం రాయండీ మావయ్యా! మేమం తా స్టేషన్ కొచ్చి రిసీవ్ చేసుకుంటాం." అని మరీమరీ చెప్పి పంపించాన్నేను.

అంటే నిజంగానే మేళతాళాలతో ఎదురేగి వాళ్లని రిసీవ్ చేసుకుందామని కాదు. అలాంటి ఉత్తరం గనక వస్తే ఆ టైంకి ఇంటికి తాళం వేసేసి, కొన్నాళ్ల పాటు మేమెక్కడికయినా వెళ్లి పోవచ్చు కదాని. కొంపదీసి ఇది ఆయన రాసింది కాదుగదా?

ఆ ఊహనే కంపరమెత్తిపోయిందినాకు. కానీ, అయి ఉండటానికి ఎంత ఆస్కార ముందో... కాకపోయి ఉండటానికీ అంతే ఆస్కారముంది.

## సినీతులు

**వంటరుచి తినేదాక తెలీదు...
పుస్తకం గొప్పతనం
చదివేదాక తెలీదు...
ప్రేమంటే ఏంటో మనల్ని
ప్రేమించే వాళ్ళని
కోల్పోయేదాక తెలీదు.**



కాబట్టి ఎలాగో గుండె దిటవు చేసు కుని ఇతర 'లూర్ల' గురించి ఆలోచించటం ప్రారంభించాను.

కడలూరులో నాకు తెలిసిన వాళ్లెవరూ లేరు. సాలూరు,నిడవలూరు అనే పేర్లు ఎప్పుడో విన్నట్టే ఉందిగానీ, అసలా ఊర్లు నిజంగా ఉన్నాయో, లేవో నాకే తెలీదు. నెల్లూర్లో 'లూరు'న్నా అక్కడ మా శ్రీమతి తాలుకు బంధువులు కొంతమంది ఉన్నా... నెల్లూరు స్పెల్లింగ్, డబుల్ ఎల్, డబుల్ ఓ, ఆర్,ఈ' కాబట్టి సమస్యే లేదు. ఇది నెల్లూరు నుండి వచ్చింది కాదు.

అలా ఇంకో అరగంట దాకా నేను దాన్ని గురించే ఆలోచిస్తూ కూర్చుండిపోయాను.

కానీ, ఆ ఉత్తకవరు ఎవరి దగ్గర్నుంచి వచ్చి ఉంటుందో మాత్రం ఇదమిద్ధంగా తేల్చుకోలేకపోయాను.




మర్నాడు ఉదయం మా ఇంటి ముందు ఆటో ఆగి, అందులోంచి ఆదినారాయణ మామయ్యగారు సకుటుంబంగా దిగుతుంటే... గుండె ఆగిపోయినంత పనయింది నాకు.

అయినా బాహాటంగా ఏడవలేను కదా? అందుకే ముఖాన్న చిరునవ్వు లాంటిది పులుముకుని వాళ్ళకి ఎదురేగి "మీరా మావయ్యా! రండ్రండి... మన వాళ్లంతా బాగున్నారా ఊర్లో? సక్కుబాయమ్మఆంటీని కూడా తీసుకు రావలసింది... అవునూ, ఉత్తరం రాసుంటే, స్టేషన్ కొచ్చి రిసీవ్ చేసుకునేవాడిని కదా? మీకెందుకు ఈ ఆటోల శ్రమ ? పోయినసారి మరి మరి చెప్పానుగా... వచ్చేముందు లేటర్ రాయమని..." అన్నాను గుర్రుగుర్రు మంటూ.

"రాశానే ! ఏ రా దుంబూ, నువ్వా ఉత్తరాన్ని పోస్ట్ చేయలేదా?" అన్నాడాయన తన మూడో కొడుకైనట్టి దుంబూ అనబడే ఓ పిల్లరాక్షసుడి కేసి అదోలా చూస్తు.

ఈలోగా అందరూ ఇంట్లోకి వచ్చేశారు.

"పోస్ట్ చేసానే !" అన్నాడు పిల్లరాక్షసుడు.

"కానీ... నాకు ఉత్తకవరే వొచ్చింది" అన్నాన్నేను.

"ఉత్తకవరు రావడం ఏంటి?... ఏరా దుంబూ... పోస్టాఫీస్‌కెళ్ళి, కవర్ కొని దాని మీద నేనిచ్చిన అడ్రస్ రాసి నేనిచ్చిన కాగితపు ఉత్తరాన్ని అందులో పెట్టి పోస్ట్ చేయ్యమన్నానుగా!... ఉత్తకవరెందుకు పోస్ట్ చేశావ్ తిక్క సన్నాసెదవా ? " అన్నాడు ఆయన కొడుక్కేసి కోపంగా చూస్తూ.

ఈలోగా అందరూ సోఫాలో సెటిలవ్వడాలూ, మా ఆవిడొచ్చి పలకరించడాలు అయిపోయాయ్!

"ఆ కాయితాన్ని కవర్లో పెట్టాలని నాకెప్పుడు చెప్పావ్?" పిల్లరాక్షసుడు ఎదురు ప్రశ్న వేశాడు తండ్రికి.

"నువ్ సరిగ్గా వినలేదేమో చెవిటి మేళంగాడా! నేన్చెప్పాను! సరే ఇంతకి ఆ కాయితాన్నేం చేశావ్? " అన్నాడాయన.

"దాన్ని కూడా పోస్ట్ డబ్బాలో వేసేశా!" అన్నాడు పిల్లరాక్షసుడు సోఫాలో ఎగిరెగిరి కూర్చుంటూ.

"ఓరి! తెలివితక్కువ సన్నాసి పీనుగా!" అంటూ పెల్లున నవ్వాడాయన.

నాకయితే బావురుమని ఏడవాలనిపించింది కానీ బాగుండదు కాబట్టి – "భలే వాడివయ్యా దుంబూ!" అంటూ సుతారంగా ఆ పిల్లరాక్షసుడి భుజంతట్టి నేను కూడా ఫెల్లున నవ్వేశాను. కాని మనసులొ మాత్రం... "నిన్నేం చేసినా పాపం లేదురా అడ్డగాడిదా!" అనుకొన్నాను ఎంతో కసిగా అంతకన్నా చేయగలిగిందేముంది ?.






## పబ్లిక్ టాక్!

# జీవంలేని వర్ణ

నిర్మలమైన ప్రేమకు లోకంలో అవరోధం లేని దారి వుంటుంది అనే పాయింట్‌తో దర్శకుడు శ్రీరాఘవ తీసిన చిత్రం వర్ణ. తాను అనుకున్నది సరిగ్గా తీయలేకపోయారో లేక ప్రేక్షకులచేత ఒప్పించలేకపోయారో దర్శకునికే తెలియాలి.

ఏది ఏమైనా ఈ చిత్రం భారీ పరాజయమే మిగిల్చింది. భారీ ఖర్చుతో ప్రయోగాలు చేస్తూ నిర్మిస్తే ఎంతవరకు ఆ చిత్రం సేఫ్టియో దర్శకుడు ఆలోచించాలి. ఈ చిత్రం మాస్‌కు ఎక్కదు. క్లాసుకు అర్థం కాదు.

కథ విషయానికొస్తే రెండు వేర్వేరు లోకాల్లో ఒకే సమయంలో జరుగుతున్న ప్రేమకథ.

మనలోకంలో డాక్టరు రమ్య (అనుష్క) మధుబాలకృష్ణ (ఆర్య)ను ప్రేమిస్తుంది. మధును పెళ్ళి చేసుకోవాలని రమ్య అడిగిస్తుంది. మధు సారీ అం టాడు. కాని తరువాత ఆమె గురించి తెలుసుకొని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు. అప్పటికే ఆమె ఇంట్లో చూసిన సంబంధం ఓ.కే. చెప్పి వుంటుంది. ఇంట్లో చూసిన సంబంధం కేన్సిల్ అవడంతో మధుతో రమ్య వివాహానికి అంగీకరిస్తుంది. కాని ఏక్సిడెంటల్‌గా చనిపోతుంది.

ఇదే సమయంలో మరోలోకంలో అనాధగా పెరిగిన వర్ణ(అనుష్క)ను, ఆ రాజ్య సైనికాధికారి కొడుకు మహేంద్ర (ఆర్య) ప్రేమిస్తూంటాడు. ఆమెసైన్యంలో చేరి యుద్ధం చెయ్యాలని ఆశిస్తుంటుంది. ఆడవాళ్ళకు సైన్యంలో చేర్చుకోవడానికి ఇష్టపడని రాజు ఆమె అందానికి ఇష్టపడి తన మందిరంలో బంధిస్తాడు. మహేంద్ర వచ్చి తను ప్రేమించిన పిల్లని విడిచివేయమని కోరతాడు. రాజు వర్ణ మహేంద్రల పెళ్ళి జరిపిస్తాడు. స్వేచ్ఛగా వున్న తనను పెళ్ళితో బానిసను చేశారని రాజుపై తిరగబడిన వర్ణ, కత్తితో పొడుచుకుంటుంది.

ఇక్కడ రమ్యను తలచుకుంటూ బ్రతుకుతున్న మధును, వేరే లోకంలో దేవతగా కొలిచే అమ్మ తన లోకానికి రప్పిస్తుంది. మధును చూసి అచ్చం మహేంద్రలా వున్నాడని అంతా ఆశ్చర్యపోతారు. అమ్మ వలన రక్షింపబడి రాజు విధించిన శిక్ష ప్రకారం అడవిలో జీవనం సాగిస్తున్న వర్ణ, మహేంద్రను చూస్తే అసహ్యించుకుంటూ వుంటుంది.

మధు దెబ్బతిని నీళ్ళల్లో పడి వేరేలోకం చేరుకుంటాడు. అక్కడ రమ్య వంటి రూపం కలిగిన మరో అమ్మాయిని చూస్తాడు.

ఈ చిత్రం ద్వారా దర్శకుడు ఏం చెప్పాలనుకున్నాడో ఆయనకైనా క్లారిటీ వుందో లేదో తెలియడంలేదు. అస్సలే కన్‌ఫ్యూజన్ కథ, స్లోగా సాగిన స్క్రీన్‌ప్లే, ఆర్ట్‌ఫిలింలో మసాలా చూపించాలని దర్శకుని ప్రయత్నం ఫలించలేదు. మధు, రమ్యల పాత్రలో క్లారిటీ లేదు.

మధును ముందు చాలా నెమ్మదస్తుడుగా చూపించి మధ్యలో విపరీతంగా అల్లరి చేసే పాత్రలో చూపించారు. ఇక వర్ణగా అనుష్కపై భారీ ఎక్స్‌పెక్టేషన్‌తో వెళ్ళిన వారికి అనుష్క కన్నా హీరో క్యారక్టర్ డామినేట్ చేసే విధంగా చూపించడంతో ప్రేక్షకులు సంతృప్తి చెందలేకపోయారు. హరీష్‌జైరాజ్ సంగీతం స్పెషల్‌గా అనిపించలేదు. ఈ చిత్రం కోసం 60 కోట్లు ఖర్చుపెట్టే అవసరమైతే లేదు. ప్రతిసీన్ గ్రాఫిక్ వర్క్‌గా ఆడియన్స్‌కి ఈజీగా అర్థమైపోతుంది.

వర్ణ పాత్రలో అనుష్క నటన మాత్రం బాగుంది. ఆర్య, మధుగా, మహేంద్రగా వేరియేషన్ తన నటనతో చాలా చక్కగా చూపించగలిగాడు. వేరే లోకంలో వున్న ప్రజలను ఫారినర్స్‌ని పెట్టడంతో ఏదో దేశంలోని స్టోరీ అనిపించింది. కాని వేరే లోకం అనే ఫీలింగ్ రాలేదు. నార్నియా చిత్రానికి ఇన్స్‌పిరేషన్‌గా తీసుకున్న ఆ ఫీలింగ్ తెప్పించ లేకపోయారు. ఇక ఆ లోకం దేవతగా అమ్మ పాత్రలో ఒక 20 సం॥ల అమ్మాయిని (ఫారినర్) పెట్టడం మరీ ఘోరంగా వుంది. ఆమెను చూసి అమ్మ అని సంబోధిస్తుంటే ఆడియన్స్‌కి నవ్వొస్తుంది. జాతీయ అవార్డులు పొందిన దర్శకునికి సలహాలిచ్చే అవసరం లేకపోయినా కమర్షియల్ మూవీ తీసే దర్శకుని స్క్రీన్‌ప్లే స్పీడ్‌గా నడిపించాలనే విషయం ముందుగా తెలిసి వుండాలి. తాను ఏమనుకున్నది ముందుగా తనకే క్లారిటీ వుండాలి. ఒక సామాన్యునికి అర్థమయ్యే విధంగా చిత్రీకరణ వుంటూ తన ఫీలింగ్స్‌ను ఆడియన్స్ చేత ఒప్పించగలగాలి. ఈ చిత్రంలో ఈ మూడు కొరబడింది.

**చంద్రశేఖర్ త్యాడి**




# ఘోస్ట్ రైటర్

పొట్లూరి సుబ్రహ్మణ్యం
9491128052

హైదరాబాదు అందమైన నగరమే...
ఇక్కడ చీమల్లా పరుగెత్తే కార్లున్నాయి...
పాముల్లాపాకే రైళ్లున్నాయి...
పక్షుల్లా ఎగిరే విమానాలున్నాయి...
ప్రక్కనే ఒదిగిన సిస్టర్లా సికింద్రాబాదుంది.

అక్కడకు బేల్దారుగా వచ్చినవాడు బిల్డర య్యాడు. సర్వర్‌గా జీవితం ప్రారంభించిన వాడు స్టార్ హోటలు ప్రొప్రయిటరయ్యాడు. కార్మికుడిగా చేరినవాడు కంపెనీ ఓనర య్యాడు.

సినిమా రంగంలో లైట్‌బాయ్‌గా ప్రవేశించిన వాడు నిర్మాతయ్యాడు. ఎక్స్ట్రా ఆర్టిస్టుగా ప్రవేశించినామె ఏకంగా సినీ హీరోయిన య్యింది. సినిమా కథలు వ్రాసి కోట్లతో బాటు కీర్తిప్రతిష్టలు సంపాదించిన రచయితలున్నారు.

ఇదిగో ఇక్కడ ఆగిపోయాడు కొండయ్య. తన చిన్ననాటి మాష్టారు హైదరాబాదు కొడుకు దగ్గరకు వెళ్లి వచ్చి చెప్పిన పై విషయాల్లో ఇది బాగా నచ్చింది.

కారణం ఉండూర్లో ఏడోక్లాసుతో చదువు మానేసి, సేద్యంలో దిగిన కొండయ్యకు సినిమాలంటే భలే ఇష్టం. తను మార్కాపురంలో వారానికొకసారి చూసి వచ్చే సినిమాలకు కొంత మసాలా కలిపి కథలు మహాపసందుగా చెప్పేవాడు. సినిమా ఫెయిలయ్యిందంటే కారణం కథనే చెప్పేవాడు. ఆ కథ ఇలా అల్లుంటే బాగుండేదని కథని మార్చి చెప్పేవాడు.

సినిమా ఫీల్డుకు వెళ్ళి తన కథలతో చరిత్ర సృష్టించాలని, కథల రారాజుగా వెలుగొందాలని కొండయ్య కోరిక.

తనకు చిన్న తనంలో ఇంగ్లీషు మాస్టారుగా ఉన్న డేవిడ్ టీచరు రిటైరయిన తరువాత పల్లెటూరి వాతావరణం ఆరోగ్యానికి మంచిదని ఈ ఊర్లోనే స్థిరపడి పోయాడు.

కూతురుకు పెళ్లి చేసాడు. కొడుకు హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నాడు, భార్యాభర్తలు ప్రశాంతంగా ఉన్నారు.

ఇటీవల భార్యతో వెళ్లి హైదారాబాదులో మూడునెలలు ఉండి వచ్చాడు. ఆ సమయంలో తనను కలిసిన శిష్యుడు కొండయ్యతో హైదరాబాదు వైభవం గురించి చెప్పాడు.

కృషి ఉంటే అక్కడ ఎంత పైకి రావచ్చో వివరించాడు.

అప్పుడే కొండయ్య తన మనసులోని మాట చెప్పాడు. “సార్ నాకు కథలు సృష్టించి చెప్పడం వెన్నతో బెట్టిన విద్య. ఈ వ్యవసాయం పెద్దగా ఆదాయం లేదు. సినిమా వాళ్లకు మంచి మంచి కథలిచ్చి మంచి పేరు తెచ్చుకుని హాయిగా బ్రతుకుతాను”

“ఓరి పిచ్చివాడా! అక్కడ నీలాంటి వారు చాలామంది ఉన్నారు. సినిమా రచయిత కావడం అంటే అంత తేలికనుకున్నావా! ప్రతి రైటర్‌కి, నలుగురైదుగురు ఘోస్ట్ రైటర్లుంటారు. నిజానికి అక్కడ ఘోస్ట్ రైటర్ల సహాయం లేనిదే అసలు రైటరు రాణించలేడు. ఇక అలాంటి ఆలోచనలు మాని హాయిగా ఇక్కడే ఉండు” అంటూ కోప్పడ్డాడు డేవిడ్ టీచరు.

టీచరు మాటలకు వినయంగా అలాగేనంటూ తల ఊపి వచ్చినా అతనికి మనసు మనసులో లేదు. తనకు సినిమారంగంలో కచ్చితంగా నిలబడగలనన్న ఆత్మవిశ్వాసముంది. ఆత్మవిశ్వాసం ఉంటే ఏదైనా సాధించగలరని తన ఈ డేవిడ్‌టీచరే చిన్నప్పుడు చెప్పి ఉన్నాడు.

ప్రతి రైటర్‌కి నలుగురైదుగురు ఘోస్ట్ రైటర్లుంటారని డేవిడ్ టీచర్ చెప్పాడు. కనీసం తన కొక ఘోస్ట్ రైటరన్నా కావాలి.

అసలు ఘోస్ట్ రైటరంటే ఎవరు?

డేవిడ్ టీచర్ని అడిగే ధైర్యం తనకి లేదు. అందుకే తనకు ఏడవ కాస్సులో తన ఉపాన్యాసానికి మెచ్చి ఇచ్చిన ఇంగ్లీషు తెలుగు డిక్షనరీ తెరిచాడు.

అందులో ఘోస్ట్ అంటే దయ్యమని, రైటర్ అంటే రచయితని ఉంది. అంటే తనకు సహా





యంగా కనీసం ఒక దయ్యం రచయితన్నా కావాలి అనుకున్నాడు.

ఆ రోజు ఉదయాన్నే పోలానికి పోయొచ్చి, మధ్యాహ్నం అన్నం తిని, పంచలో అరుగు మీద కూర్చుని దారిన బోయేవాళ్లని విచారించడం మొదలు పెట్టాడు.

తన గ్రామంలో గతంలో ఎవరైనా కవి మరణించాడా అని.

ఎవరూ చెప్పలేక పోయారు.

కాని ఆమధ్యాహ్నం ఎండనబడి చెమటలు కక్కుకుంటూ వచ్చిన ఆ ఊరి వృద్ధు డొకడు ఆయాసంగా పంచలోపలి కొచ్చి అరుగుమీద కూర్చున్నాడు.

కొండయ్య వాకబు చేయడం చూసి, “ఒరే కొండా! ఆ విషయం నేను చెబుతానురా. మంచి నీళ్లు తెచ్చి పెట్టు” అన్నాడు.

కొండయ్యకు పంట పండినట్లయ్యింది.

మంచి నీళ్లతో బాటు, మజ్జిగ కూడా తెచ్చిచ్చాడు.

రెండు తృప్తిగా సేవించి...“ఒరే మన వడా! యాభై ఏళ్ల క్రితం మనూర్లో బ్రహ్మయ్య అని బాలకవి ఒకడుండేవాడు. బాలకవి అంటే పసివాడేం కాదు. బాల్యం నుంచి కవిత్వం, కథలు వ్రాయడం వల్ల ఆ పేరొచ్చింది. తొంభైఏళ్ళ వయసులో చచ్చి పోయాడు. భార్య ముందే చనిపోయింది. వారసులు లేనందువల్ల శవాన్ని



ఇదుగో ఈ చేతులతో ఊరికి ఉత్తరాన స్మశానంలో బూడ్చి పెట్టాను. అప్పుడు నా వొయసు ముప్పయితొమ్మిదేళ్లు. ఎలగసెట్టు కింద ఇప్పటికీ ఆయన గోరీ ఉండాది. దానిమీద ఆయన పేరు గూడా సెక్కుండాది” అన్నాడు.

కొండయ్యకు పరమానందమయింది. ఆ ఆనందంలో తాత వెల్తుంటే చుట్టలు కొనుక్కోమని ఓ ఇరవైరూపాయల నోటిచ్చాడు.

ఎండ తగ్గగానే ఊరికి దూరంగా ఉత్తరం వైపునున్న స్మశానం వైపు బయలు దేరాడు. స్మశానం చుట్టూ అంతెత్తున వేపచెట్లు, నేరేడు చెట్లు, దిరిశెన చెట్లు పెరిగి ఉన్నాయి.

ఆ చెట్ల మధ్య వెలగచెట్టును గుర్తు పట్టాడు. దాని క్రింద పురాతన సమాధి ఉంది. దాని పైన ఏదో వ్రాసి ఉంది.

తన చొక్కా విప్పి దాని మీద బాగా రుద్దిన తరువాత ఆ రాత కనిపించింది. అందులో బాలకవి, (1871 -1960) అని ఉంది. వెంటనే ఈ బాలకవి దయ్యాన్ని లేపి, తనకు ఘోస్ట్ రైటర్‌గా పెట్టుకోవాలనుకున్నాడు.

ఇంటికొచ్చిన కొండయ్య వాకబుచేస్తే తన గ్రామానికి దగ్గర లోనే పామూరులో మంచి దయ్యాల మంత్రగాడు ఉన్నాడని తెలిసింది.

చీకటితోనే లేచి పామూరు వెళ్లాలి కాబట్టి ఆ రాత్రి బయట పంచలోనే పడుకున్నాడు.

వేకువజామున లేచి బయలుదేరి తెల్లారే సరికి పామూరుకెళ్లి మంత్రగాడ్ని కలసి అసలు విషయం చెప్పాడు.

మంత్రగాడు మహా శక్తివంతుడు.

కొండయ్యతో రెండువేలకు ఫీజు మాట్లాడుకున్నాడు. ఆ రాత్రే వచ్చి సమాధిముందు కోడిని బలిచ్చి మంత్రాలు చదివి విజయవంతంగా బాలకవి దయ్యాన్ని లేపాడు మంత్రగాడు. తరువాత తన మంత్రశక్తితో బాలకవి భూతాన్ని సీసాలో బంధించి ఇచ్చాడు.

భూతవైద్యుడు తన దారిన తాను వెళ్లిన తరువాత, కొండయ్య ఇంటికి వచ్చాడు.

అతని ఆనందం అంతా ఇంతా కాదు. వెంటనే హైదరాబాదు ఫిల్మ్‌నగర్‌కి వెళ్లాలని ఉంది. తన ఘోస్ట్ రైటర్‌ని పరీక్షిద్దామని, సీసా మూత తెరిచాడు.

సన్నని పొగ బయటికి వచ్చింది.

క్షణాల్లో ఆ పొగంతా కూడగట్టుకుని తెల్లని

**సినీతులు**

**మనం నమ్మగలిగేవి మాత్రమే నిజాలు... భరించలేనివన్నీ అబద్ధాలు అయితే చాలా బాగుండేది.**






అస్పష్టమైన రూపం ఏర్పడింది. తెల్లని గుండు తల మధ్య నల్లని కనుగుడ్లు, రెండు తెల్లటి చెవులు, రెండుపొట్టి చేతులు, పొట్ట, నడుము అంటూ ప్రత్యేకంగా లేవు. దానికి బదులుగా పోనుపోను సన్నబడి తోక ఏర్పడిఉంది.

మొత్తం ఆకారం కొండయ్య కెదురుగా గాలిలో తేలుతూ ఉంది. రెండు చేతులు వినయంగా కట్టుకుని ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్నట్లుగా ఉన్నాడు.

"చెప్పండి నాయకా! నేను బాలకవి భూతన్ని, మీరు చెప్పినపని చేయడమే నా కర్తవ్యం"

భూతం మాటలకు ఉలిక్కిపడ్డ కొండయ్య ధైర్యం తెచ్చుకుని, "నువ్వు నాకు ఘోస్ట్‌రైటర్‌గా ఉండాలి. సినిమా కథలు వ్రాసి అందిస్తుండాలి. అన్ని రకాల కథలు వ్రాయగలవా?..." అన్నాడు.

బాలకవి భూతం కిసుక్కున నవ్వింది.

"నాయకా నేను చేయలేని పనంటూ లేదు. ఇక కథలన్నారా! అది నా ఫేవరేట్ సబ్జెక్ట్. నేను తొమ్మిది చేతులను సృష్టించుకొని ఏక కాలంలో నవరసాలు ఉట్టిపడే తొమ్మిది కథలు వ్రాయగలను. దాన్ని గురించి ఆలోచించకండి. వెంటనే నా భుజం మీద ఎక్కండి. ఇప్పుడే మిమ్మల్ని హైదరాబాదు ఫిలింనగర్లో దించేస్తాను" అంటూ నేలకు రెండడుగుల ఎత్తులో బోర్లా పడుకున్నాడు.

కొండయ్య వెంటనే భూతం మీద అటొక కాలు, ఇటొక కాలు వేసి కూర్చున్నాడు.

ఆకాశంలోకి లేచి ముందుకు దూసుకు పోయింది బాలకవి భూతం.

రివ్వున గాలిలో పోతుంటే నగరాల సౌందర్యం కొండయ్యకు కనువిందు చేయసాగింది.

హైదరాబాదు అన్నపూర్ణా స్టూడియో ముందు దిగింది.

"నాయకా! ఇక్కడ మీపేరు కె.డి.అయ్య. వెరైటీగా ఉంటుంది. మీరు ఇక్కడ నడిచిపోతే ఎవరూ లెఖ్క చెయ్యరు. నేను కారుగా మారుతాను. కారు వెనక సీట్లో కూర్చోండి. మిమ్మల్ని ఫిలింనగర్‌లోని మంచి హెూటలుకు తీసుకు వెల్తాను" అంటూనే బాలకవి భూతం కొత్త ఇంఫాలా కారులా మారిపోయింది.

'డ్రైవరు లేకుండా కారు పోతుంటే దయ్యం కారు అనుకుంటారు' తనలో తనే అనుకున్నాడు కె.డి.అయ్య.

"అవును! నిజంగా దయ్యం కారే. అయినా ఇలాంటిది చూస్తే ప్రజలు భయపడతారు. అందుకే నేనే డ్రయివరుగా కూడా మారుతాను" అంటూ మాటలు వినిపించాయి.

వెంటనే స్టీరింగు ముందు యూనిఫారంలో డ్రైవరు కూర్చుని ఉన్నాడు.

కారు ఫిలింనగర్ లో ఒక కంపెనీ ముందాగింది. "వాళ్లకు కామెడీ కథ కావాలంట. కథ ఒకసారి చూసుకుని వెళ్లండి" అంటూ ఒక అందమైన ఫైలు అందించాడు డ్రైవరు.

ఒక పేజీలో సింగిలు లైనులో కథ మెయిను పాయింటు ఉంది. తరువాత ఒక పేజీలో కథ ఉంది. తరువాత సీనిక్ ఆర్డరు. తరువాత సీన్ బై సీన్ స్క్రీన్‌ప్లే బొమ్మలతో సహా ఉంది. తరువాత పేజీల్లో సంభాషణలు. బాలకవి భూతం మహత్యం వల్ల మొత్తం కథ కె.డి. అయ్య మెదడులోకి ఎక్కి పోయింది.

ఆఫీసులోకి తేలిగ్గానే ప్రవేశం లభించింది. తనను తాను పరిచయం చేసుకున్నాడు కె.డి. అయ్య, అతను చెప్పిన కథవిని వాళ్ళు మురిసి పోయారు. దాంతోపాటు, స్క్రిప్టు, స్క్రీన్‌ప్లే, సంభాషణలతో సహా అందించే సరికి వాళ్ళు



